ఓం

# ఉపోద్ఘాతము.



బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతం నమామి॥
పార్థాయప్రతిపాదితాం భగవతానారాయణేనస్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతం
అద్వైతామృతవర్షిణీంభగవతీమష్టాదశాధ్యాయినీ
మంబత్వామనుసందధామిభగవద్గీతే భవద్వేషిణీం॥

పురుషార్థ చతుష్టయంబగు ధర్మార్థకామ మోక్షంబులందు నుత్కృష్టతమంబగు పురుషార్థంబైన మోక్షంబు జ్ఞానంబుచేదక్క నన్యంబుచే నలవడదని "జ్ఞానాదేవతు కైవల్యం,, "నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే,, ఇత్యాది శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. జ్ఞానమన్ననో ప్రమాణాధీనంబు. ప్రమాణంబు ప్రత్యక్షానుమానాప్తవాక్యార్థాపత్త్యనుపలబ్ధిరూపంబు. షడ్విధప్రమాణంబులందు నాప్తవాక్యమనియొప్పు శ్రుతి పరమప్రమాణంబు. శ్రుతిననుస

రించు ప్రత్యక్షాదులు పాదేయంబులనియుఁ దద్విరుద్ధంబులు హేయంబులనియు బుధులు వక్కాణించుచున్నారు.

« తదర్థగ్రహణదార్ఢ్యాయానుమానమపి వేదాంతవాక్యావిరోధిప్రమాణంభవన్ననివార్యతే. »

ఆన్యాయముచేతనే శ్రుత్యనుగుణంబులగు స్మృత్యాదులు గూడప్రమాణంబులుగబుధులచే గౌరవింపఁబడుచున్నవి దానంజేసి యాప్తవాక్యంబుగ శ్రుతియుఁ దదర్థోపబృంహణంబుఁ జేయుస్మృతులు నార్యావర్తంబునఁ బూజనీయములై యున్నవి. శ్రుతియన్న నప్రయత్నముగాఁ బురుషనిశ్వాసము వలెఁ బరమేశ్వర ముఖమునుండి వెలువడిన యనేకశాఖాభేదభిన్నమయినట్టియు, దేవతిర్యఙ్మనుష్యవర్ణాశ్రమాది ప్రవిభాగహేతువైనట్టియు సర్వజ్ఞానాకరమైనట్టియు ఋగ్యజుస్సామాథర్వనామంబులచే నొప్పునట్టియు వేదరాశి, శ్రుతిస్మృతులనంతంబులగుటం జేసి తదర్థము దురవగాహంబుగావున నద్దానిని సుగమంబుగ లోకమునకు వెల్లడిఁజేసి జనుల నెల్లర వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థులుగఁజేయ వేదవ్యాసుండు ప్రస్థానత్రయమును బ్రసాదించె. ప్రస్థానత్రయమన్న నుపనిషత్తులందుఁ బదియగు నీశకేనకఠప్రశ్నముండ మాండూక్య తైత్తిరీయైతరేయ ఛాందోగ్యబృహదారణ్యంబులును, తదర్థమును స్ప

ష్టీకరించు వేదాంత దర్శన రాజంబును, పంచమ వేదంబగు మహాభారతపయోరాశికి జాబిల్లియననొప్పు కృష్ణార్జున సంవాదరూపంబగు గీతాశాస్త్రమును నాటంగోలె నీగ్రంథత్రియం బార్యావర్తంబునఁ బరమప్రమాణంబుగ నెన్నఁబడుచు జిజ్ఞాసువులచే సత్యాదరంబుఁ జెందుటంజేసి మతమునకు నాయువుపట్టుగాఁ బ్రకాశించుచున్నది. ఆర్యావర్తమున వేదప్రమాణము నంగీకరించువారలందఱకు నీగ్రంథత్రియము పూజనీయమై యున్నయది. దానంజేసి మతమును బోధించువారలెట్టితత్త్వమును బ్రదర్శించుచువచ్చిననయ్యది ప్రస్థానత్రియాను గుణంబుగ నున్నదని ఋజువుచేయవలసి వచ్చుచుండెడి. దానంజేసి మతప్రవర్తకులు స్వకపోల కల్పితసిద్ధాంతంబుల నరణినీప్రస్థానత్రియంబునకు వ్యాఖ్యానంబులం జేయుచు శిష్టాచారసాంప్రదాయాను సారంబుగ నతిశయిల్లు నర్థమునకు వైయర్థ్యమునుగల్గించిరి. ఇట్లునేటికిత్రివిధంబులగువ్యాఖ్యానంబులీప్రస్థానత్రయమున కానర్థక్యమును గల్గించినవి. దానంజేసి జిజ్ఞాసువులే వ్యాఖ్యానములుపాదేయములో యేవి హేయములో నరకుగొనలేక సంశయాత్మకులై యనర్థము నొందుచుండుటచే నట్టిముముక్షుజనోప యోగమునకై యీభగవద్గీతా తత్త్వనిర్ణయ ముప్రకాశింపఁబడియె.

గీతాశాస్త్రమేడు వందల శ్లోకంబులతో నొప్పుచుం బడునెనిమిది యధ్యాయములుగ విభజింపఁబడియున్నది. అందు మొదటి రెండధ్యాయములు మూలగ్రంథ రూపముగాను మిగిలిన పదునారధ్యాయములు మూలగ్రంథవ్యాఖ్యానరూపముగాను ప్రకాశించుచున్నవి. దానం జేసి మూలగ్రంథమగు మొదటి రెండధ్యాయములతత్త్వము విమర్శింపఁబడినచో గీతాశాస్త్రతత్త్వము విమర్శింపఁబడినదగును. కావున నిందు మొదటి రెండధ్యాయముల తత్త్వము దేటపడునటుల నందలి శ్లోకరాజంబుల యర్థము మాత్రము స్థాలీపులాకన్యాయమున మతత్రయ విమర్శపూర్వకంబుగాఁ బ్రదర్శింపఁబడియె. కావున ధీమంతులెల్లరునుపయోగమునొందుదురుగాక!



ఓం.

# భగవద్గీతాతత్త్వనిర్ణయము.

## అర్జునవిషాదయోగము.

ఈ గీతాశాస్త్రమునకు యుక్తమైన యధికారిని నిరూపించుటకై యీయధ్యాయము ప్రవర్తించుచున్నది. ఈగీతాశాస్త్రమర్జునునకు శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడెనని యెల్లరు నెఱింగిన యంశమేగదా. దానంజేసియీగ్రంథమునకు నర్జునుండధికారి. కావున నర్జునుని గుణములవంటి గుణములు గలవాఁడీ గ్రంథమున కధికారియని యెఱుంగునది. అర్జునుని గుణసంపదను గుర్తెఱుంగుటెట్లన, లోకములో నందరి గుణసంపద నెట్టులఁ దెలియనగునో యట్టులె యర్జునుని గుణసంపదను గుర్తెఱుంగునది. అంతర్యధర్మంబును గుర్తెఱుంగుటకు, బాహ్యంబులగు వాచికకాయిక వ్యాపారంబులుగదా తగు సాధనంబులు? ఒక పురుషునియొక్క చేష్టలనుండియుఁ బల్కులనుండియుఁగదా బుద్ధిమంతులెల్లరును గుణగ్రహణంబును జేయుదురు ? అటులనె అర్జునునియొక్క వాక్కులనుండియు చేష్టలనుండియే యర్జునునియొక్క గుణగ్రహణమును జేయుట

లయును. ఇట్టివాక్యములను జేష్టలను గమనించినచో నట్టిపురుషునియొక్క స్థితిగతులనుఅనఁగా నవస్థను ప్రథమంబున తెస్సగా గమనింపవలయు. లేనిచో యథార్థమును గనిపెట్టుటకు నెంతమాత్రము నవకాశము చిక్కదు. ఒకానొకఁడు హాయిగ స్నేహితులనడుమఁగూర్చుండి వినోదముగాఁ గాలము వెళ్ళఁబుచ్చు సమయమునఁదానొకపులి నెదుర్కొనెనెదనియుఁ నర్ధరాత్రమున నరణ్యమందు నిబ్బరముగ సంచారముసేయఁగలననియుఁ జెప్పవచ్చును. అట్టిపురుషుఁడు మఱియొక సమయంబునఁ బిల్లిని జూచి జంకినను బట్టపవలింటియందు నేకాంతముగా నుండుటకును గూడ జడిసినచో నాతని పల్కులవలన నాతని యథార్థతత్త్వమును గుర్తెఱుంగనవకాశముండునా ? ఆ తీరుననే యొకఁడొక నాటకపాత్రమును జూపుచు నధికవిలాపముచే జనులహృదయములఁగరఁగింప నాతఁడువాస్తవముగశోకమున మున్గియున్నాఁడని యెవ్వరైన నూహింతురా ? ఎంతమాత్రమునూహింపరు. కావున వాక్చేష్టల విమర్శనంబునకుఁ బూర్వ మవస్థావిమర్శనంబు గర్తవ్యాంశంబు. ఇయ్యధ్యాయంబున నొక్కయర్జునుని గొసంబులెగాక నిందుఁబ్రస్తావనచేపచ్చువారల యొక్క గొనంబులుఁగూడ తేటతెల్లమగుచున్నయవి. ఏలయన నీయధ్యాయము గుణనిరూపణంబెప్రాధాన్యంబు

గాఁ గల్గియున్నది. అయితే యిందు నర్జునగోనంబులు ముఖ్యము. తదితరులగోనంబులు ప్రాస్తావికంబులు. అయిన నందులోఁ గొందఱిగుణంబులువిమర్శించుట ప్రధానపాత్రగుణగ్రహణంబునకుఁ బుష్టిని గలుగఁజేయుఁ గావునఁగొంతవనుక ముచ్చటింతము. ఉపపాత్రంబులలో ధృతరాష్ట్రునియొక్క గుణవిమర్శనంబుప్రారంభింతము.

## ధృతరాష్ట్రుఁడు.

ధృతరాష్ట్రుని గుణవిమర్శనంబుఁ జేయుటకు నియ్యధ్యాయంబునంగల నాధార మాతని ముఖంబునుండి వెలువడిన వాక్యంబైన "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః। మామకాః పాండవాశ్చైవ కిమకుర్వతసంజయ॥ (1.1)

అనుశ్లోక మొక్కటియె. ఈశ్లోకంబునందు గుణగ్రహణమునకునవకాశమిచ్చు పదంబులు "కిమకుర్వత," "ధర్మక్షేత్రే," "మామకాః," యనుమూఁడుపదంబులు మాత్రమే. గుణవిమర్శనంబునకుఁబూర్వముపూర్వకథాసందర్భమునుగొంత గ్రహింపవలయుఁగదా! భారతకథసర్వజనసామాన్యముగఁదెలిసియుండుటచే నిందుఁబ్రకృతమునకు నుపచరించువిషయంబుల మాత్రము సంక్షేపంబుగఁ బరిశీలించెదము.

పాండవులును గౌరవులును, పాండవులయొక్క యజ్ఞాతవాసంబుల యనంతరమున రాజ్య విభాగ వ్యవ

ప్రారంబున సామరస్యమును జెందక చిట్టచివరకు యుద్ధముచే యనిశ్చయించుకొని కురుక్షేత్రమున నుభయపక్షముల వారు ను జేరిరి. ధృతరాష్ట్రుండు కౌరవులకుఁదండ్రి కావున యుద్ధ మాచారమును లెస్సగాఁ దనకుఁదెలియఁజెప్పువానినెవ్వనినను ననేర్పాటుచేయుఁడని వ్యాసుని బ్రార్థింపనావ్యాసుం డాతనిప యిఁగరుణతోఁ దనశిష్యుండగు సంజయునకు దివ్యజ్ఞానంబొ సంగి యుద్ధసమాచార మంతయును బూర్ణముగ ధృతరాష్ట్రుని కుఁజెప్పుమని యానతియ్య నట్లుసంజయుండె ప్రతివృత్తాంతము నప్పుడ ధృతరాష్ట్రునకుఁ జెప్పఁదలంచి ప్రథమదివససాయంకా లంబున ధృతరాష్ట్రుని దరిఁజేరధృతరాష్ట్రుండీ వాక్యంబులనా తనిబృచ్ఛచేసె. సంజయుండు సార్థకనాముండు "సమ్యక్ యోజయతీతిసంజయః" లెస్స గా యోజించు వాఁడు గావున సంజయుండు. ఈతఁడుసత్యవాది. దానంజేసియే యాతనివా క్యములందుధృతరాష్ట్రునకుఁగలగౌరవము. యుద్ధసమాచార మొరులెవ్వరైనఁ జెప్పవలసివచ్చినచోఁ గొన్నిచోటులనతిశ యోక్తిగను గొన్నిచోటులన్యూనోక్తిగను జెప్పుదురు. దానం జేసి యథార్థము దెలియమిచేఁ దండ్రియయినదానుఁజిక్కు నొందవలసివచ్చునని యేయాయన, యథార్థవాదినిదనకుఁజూ పుమని వ్యాసుని బ్రార్థించుట. సంజయుఁడు యథార్థవాది

గావున నున్నది యున్నట్టులఁ జెప్పినను నమ్మక మొరు లెవ్వరి యందు విశ్వాసము లేని ధృతరాష్ట్రునకుఁ గూడఁ గలదు. దానం జేసియే సంజయు ఘనత వెల్లడియగుచున్నది.

ధృతరాష్ట్రుఁడు కౌరవులయొక్క దుర్న్యయమును దుర్బలమును, పాండవులయొక్క సౌజన్యము సామర్థ్యమును బాగుగ గుర్తెఱుంగును. దానంజేసి యుద్ధము జరగినచో గౌరవులకుఁ దప్పక ముప్పగలుగును. దానంజేసి తనకు దుఃఖము ఘటిల్లును. గావున నెట్లయిన యుద్ధము జరగకుండునా యని తలంచుచున్నవాఁడు. లేకుండినచో శ్లోకమునందు సందర్భముగనగపడు “కిమకుర్వత” = “ఏమి చేసిరి” యను ప్రశ్నంబును జేసియుండఁడు. ఏలయన వాసవముచే శ్లోకమునందు సందర్భానుగుణంబుగ “కథం యుద్ధం ప్రవృత్తం॥” “యుద్ధమెట్లు జరగెను” అను ప్రశ్న ముండవలయును గాని “కిమకుర్వత” యను ప్రశ్న మసందర్భంబు. ఏలయన శ్లోకమునందు “సమవేతా యుయుత్సవః” యుద్ధముఁ జేయ నిశ్చయించి కూడిన వారలై యని చెప్పఁబడియున్నది. యుద్ధముఁ జేయ నిశ్చయించి కూడినవారల యుద్ధమెట్లు జరగెనన్నచో యుక్తముగ నుండుఁగాని, యుద్ధము చేయ నిశ్చయించి కూడిన వారలేమి చేసిరి యను ప్రశ్న సందర్భముగ నుండునా? ఎంతమాత్రమును సందర్భముగ నుండదు.

అయితే ధృతరాష్ట్రుడంత యసంబద్ధప్రలాపియా? ఎంతమాత్రమునుగాడు. ఇట్లుప్రశ్నంబునడుగుటకు నొకమహాశ్చర్యమైన యుద్దేశంబు మనంబున నుండవలయుఁగాని యొండుగాదు. అదియెద్ది? యుద్ధమెట్లులైన జరగకపోవుట తనబిడ్డలేరీతినైన జీవించియుంట. అయితే యుద్ధముసేయ నిశ్చయించి వెళ్ళినవారలన్నుండి యుద్ధవిముఖత్వము నీతఁడెట్లు తలపెట్టెను. చూడుము శ్లోకప్రారంభము „ధర్మక్షేత్రే" యనుపదము నొకదానిం బ్రయోగించియున్నాఁడు „కురుక్షేత్రే", కురుక్షేత్రమందుయుద్ధముచేయనిశ్చయించికూడిన యనినంతనెయభిప్రాయంబుదేటపడుచుండ „ధర్మక్షేత్రే" యనుపదము నెక్కుడుగ నెందుకుఁ బ్రయోగింపవలయును. ఛందోపూర్తికొఱకు నందురా తెలివిలేమియని శాస్త్రజ్ఞులాక్షేపణంబుఁజేయుదురు. ఎద్దియేని పదమును బ్రయోగించినచో సర్థరాహిత్యముగను గౌరవముగను బ్రయోగింపఁగూడదు. మఱియునీపదమొక విశేషణంబుగఁ బ్రయోగింపబడియె. విశేషణంబెన్నఁడు నభిప్రాయరాహిత్యమైయుండదు. ఎట్టియభిప్రాయముతో నీపదమునుధృతరాష్ట్రుండు బ్రయోగించె. కురుక్షేత్రంబు ధర్మక్షేత్రంబు గావున నక్షేత్రస్థలమహాత్మ్యముచే నచ్చటికిఁ బోయినవారలకు ధర్మంబునందాసక్తిపుట్టి దానంజేసి దుర్యోధనాదులు దుర్మార్గులైనను స్థ

లమహాత్మ్యంబుఁ జేసి సన్మార్గంబుఁ జెంది పాండవులకొఱకై ప్రాకారము సంధిఁ జేసికొని యిల్లు సేరవచ్చు. అట్టుదుర్యోధనాదులకు మంచిదోఁచకపోయినను పాండవులు సహజధర్ములును సాత్వికులునుగావున బంధువధాది దోషములోనగు పాపమునందు భయముఁ జెంది యుద్ధమును మాని, ఇదివఱకలవాటుపడి యుండుటచే మరలనడవులకుఁ బోయి మునివృత్తిం జీవింపవచ్చు. ఏరీతినైనను దనపిల్లలు సుఖజీవులై యుండుటకు నవకాశమిచ్చునని తలంచి “ధర్మక్షేత్రే,, “కిమకుర్వత,, యనుపదములఁ బ్రయోగించె. ఏమిపింత తనకొడుకులకంత సౌఖ్యమునుగోరువాఁడు పాండవు లేరీతిఁ బోయినను సరేయని తలంచునా? ఆ! తప్పక తలంచును. సందియమెందును లేదు. ఈతనుపుత్త్రులయందలిమమకారముతోఁ బీడింపఁబడియున్నవాఁడు. ఇందుకు నీతఁడు ప్రయోగించిన “మామకాః,, “పాండవాః,, అనుపదములే సాక్ష్యములు. కౌరవులను జెప్పుటలో “మామకాః,, నావారనియును ధర్మరాజాదులను జెప్పుటలో “పాండవాః,, పాండురాజుకొమాళ్ళనియు నెవ్వరినో యన్యులఁ జెప్పినట్లు సూచించియున్నాఁడు. దీనిచేఁ దెలియవచ్చునదేమన ధృతరాష్ట్రుఁడు పూర్ణమగు మమకారవిశిష్టుఁడని మమకారమెప్పుడు తెలియవచ్చుచున్నదో యప్పుడే మమకారమునకుఁ గారణంబగు నహం

కారమావరించియుండు ననుటకు సందియములేదుగదా? కావున నీతఁడహంకార మమకారవిశిష్టుఁడు. అహంకారమమకారములున్నచోఁ జర్మచక్షువులుండినను లేనియట్లే. దానంజేసియె యీతని పుట్టుగ్రుడ్డివానిగా వర్ణించిరనియు నీతఁడహంకారమమకారములమూర్తిభావమనియు నలంకారశాస్త్రజ్ఞులు దెల్పుచున్నారలు.

## దుర్యోధనుఁడు.

ఇంక దుర్యోధనుని గూర్చి కొంత ప్రశంసింతము. ఈతనినామం బే యీతని గుణములను గొంతవఱకు వెల్లడిచేయుచున్నయది. "దుష్టంయుద్ధ్యంతి అనేన దుర్యోధనః" వీనిచే దుర్మార్గముగా యుద్ధము చేయఁబడును గావున దుర్యోధనుఁడు. ఇంక నీతనిని అర్జునుఁడాతతాయిగాఁ బల్కియున్నాఁడు.

" పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః.
(1. 36) ఆతతాయు లనఁగా " అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః । క్షేత్రదారాపహర్తాచ షడేతే హ్యాతతాయినః ॥ చిచ్చుపెట్టువాఁడు, విషముఁబెట్టువాఁడు, శస్త్రముధరించి యెదుర్కొనువాఁడు, ద్రవ్యమపహరించువాఁడు, భూమినపహరించువాఁడు, భార్యనుదొంగిలించువాఁడు ఈయాఱుపురుషులు ఆతతాయులని చెప్పఁబడుదురు. ఈయాఱుగుణము లందు నొకొక్కగుణ

ఘోరమైనవిషయమంబె. ఆచార్యునికడఁ జేరెననునంతనె యట్లు చేయుటకు భయము గారణమని వేఱవచింపనక్కఱలేదు. ఏగా-యూచార్యుని కడకుఁ బోయి నంతనె భయముఁ జెందినవాఁడగునా? ఆచార్య దర్శనముచే నానందింపఁబోఁగూడదా పోయినను బోవచ్చుఁగాని దుర్యోధనుఁ డిచ్చట సందర్శనమాత్రమునకై పోలేదు. అటుబోయి "వచనమబ్రవీత్" వాక్యమును బలికెను అని సంజయుండు చెప్పుచున్నాఁడు. "అబ్రవీత్" అనునంతనె మాట్లాడెనుపలికెనుఅను నర్థమగుచుండ "వచనమ్" అను పదమునుగూడ నెందుకు సంజయుండు ప్రయోగింపవలయును. "వచనమ్" అనుటలో నేదియో యొకగొప్ప స్వారస్యముండి తీరవలయును. ఏదోయొక గొప్పవిషయమునుగూర్చి ముచ్చటింపఁదలఁచెను గాని యూరక పోలేదని తెల్లమగుచున్నది. ఐనను దుర్యోధనుఁ డు హృదయమునఁ దాఁగియున్న భయమును వెల్లడిచేయకుండ తనగౌరవమును నిలుపుకొనుచు గార్యమును సాధించు యత్నముఁ జేయుచు గంభీరముగా మాట్లాడుచువచ్చెను. ఇట్టిబాగగాకత

"అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం,,

పర్యాప్తం త్విదమేతేషాం బలంభీమాభి రక్షితం 1-10

అనుశ్లోకమునందుగల క్లిష్టకల్పనచేఁ జేట తెల్లమగుచున్నది. ప్రి

క్షేత్రమున దుర్యోధనుని యొక్క భయమునకుఁ గారణమేమనఁ పాండవుల యొక్క సేనాపరాక్రమంబును, ద్రోణుఁడు మొదలు గాఁగల తన సైన్యమునందలి మహామహులయందలి సందియంబును, ద్రోణాచార్యునకు నర్జునుని యందు ప్రియుఁడగుట. శిష్యుఁడు మఱియు దుర్యోధనుని కార్యములయందలి మంచిచెడ్డలను గుర్తెఱింగిన మహాపురుషుండు నగుటఁ జేసి ద్రోణునకుఁ దానును గడచిన పదమూఁడు సంవత్సరములనుండియుఁ బోషకుండగుటచే దుర్యోధనుపక్షము నవలంబించినను అర్జునునియందలి వాత్సల్యముచేఁ బూర్ణమగు తనపరాక్రమంబు వినియోగింపఁ జేయకుండునేమోయని సందియమనస్కుండును భీతచేతస్కుండునై యట్టి ద్రోణునకుఁ బాండవులపై ద్వేషమును గలుగఁజేసి తనపక్షమునఁ దీవ్రముగఁ బని చేయునటులఁ బ్రేరేపించు నుద్దేశముతో నాతనికడఁ జేరి కొంతవఱకు యుద్ధసన్నాహులైన రెండు పక్షములవారిని గూర్చి ముచ్చటించుమిష చేతన కార్యనిర్వాహమును జేసికొనఁ జూచుచున్నాఁడు. దుర్యోధనుని యొక్క నామార్థముచేఁ జెల్లమగు గుణము నాతని పల్కులనుండి పూర్ణముగా గ్రహింపనగును. దుర్యోధనునిచే ద్రోణు నుద్దేశించి పలుకఁబడిన ప్రథమవాక్యంబును గొంతవఱకు విచారింతము

« పశ్యైతాం పాండుపుత్రాణామాచార్య మహతీం చమూం,»

వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవశిష్యేణ ధీమతా,, I-3

ఇందుదుర్యోధనుని గుణంబును గనుఁగొనన వకాశమిచ్చు పదంబులు " ద్రుపదపుత్రేణ ,, " తవశిష్యేణ ,, యనునవి. ద్రుపదరాజు ద్రోణునకు శత్రువు శత్రువుకొమారుండుగూడ శత్రువే కద. ఇంతియెకాక ద్రుపదపుత్త్రుండగు దృష్టద్యుమ్నుండు తనతండ్రిగారి పరాభవమునకుఁ గినిసి ద్రోణుని శిరము నఱకెదనని ప్రతిజ్ఞ చేసి యట్టి కార్యమును నిర్వాహముఁ జేసికొనఁ బాండవ సైన్యమందున్న వాఁడు. ఇంకనీదృష్టద్యుమ్నుఁడు ద్రోణశిష్యుండు. అట్టి శిష్యుఁడును వైరిపుత్త్రుండును నగుదృష్టద్యుమ్నుండు కాకతాళీయంబుగఁ బాండవపక్షంబున సేనానాయకత్వంబును జేకొనియెను. ఇట్లు దృష్టద్యుమ్నునికి సేనానాయకత్వము నిచ్చుటలోఁ బాండవులు నిరపరాధులని లెస్సగా నెఱుఁగునది. అయినను దుర్యోధనుండు దన కార్యసాఫల్యమునకు నీకార్యమునందొక గొప్పయవకాశమును గనిపెట్టి ద్రోణునకు వైషమ్యమును గలుగఁ జేయఁజూచెను. ఇట్లు కొంతవడి ద్రోణునితో ముచ్చటింప నాతఁ డెద్దియును బ్రత్యుత్తరమీయకుండెనంత దుర్యోధనుండు సేనానాయకత్వమును వహించియున్న భీష్మునియందలి గౌరవమును బ్రకటించుటచే నాతని నుబ్బించి తనకార్యముఁ జేసికొని భీష్ముఁడు పన్నునట్లుగా ద్రోణునితో నిట్లనియె.

అయనేషుచ సర్వేషుయథాభాగమవస్థితాః
భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వఏవహి॥ 1-11

ఈప్రకారముగ దుర్యోధనునియందు, యుద్ధారంభంబున ద్రోణునకుఁ వైమనస్యమునుగలుగఁజేయుట, భీష్మునుబ్బఁజేయుట యను రెండు కృత్రిమోపాయంబులు వెల్లడియగుచున్నవి.

సంజయుఁడు.

సంజయస్వభావమును దెలియుటకూడ మిక్కిలి యావశ్యకంబు. ఇదివఱకు సంజయుఁడు యథార్థవాదియని చెప్పఁబడెను. ఇందుకుఁదగునిదర్శనమెద్దియైనఁగలదో యొకింత విచారింతము. ఈతనితత్త్వమునుగని పెట్టనీతఁడు ధృతరాష్ట్రునకుఁజెప్పినయుత్తరంబసాక్షి. ధృతరాష్ట్రుఁడుతన కొమారులకేద్దియేనిలాభముగలైనేమో తెలిసికొందమని గదా ప్రశ్నంబుఁజేసెను? సంజయుఁడు యథార్థవాదియేగాక ముఖప్రీత్యర్థంబులుపల్కు సామాన్య జనుఁడైయైన చో

దృష్ట్వాతు పాండవానీకంవ్యూఢందు ర్యోధనస్తదా
ఆచార్యముపసంగమ్య రాజావచనమబ్రవీత్ ॥ 1-2

అనుశ్లోకమునుబలికియుండకపోవలెను.

ధృతరాష్ట్రునియభిప్రాయము శాస్త్రనము చేఁ బాండవులు స్వజధర్మలుగావున యుద్ధమును త్యజించుదురు. దానంజేసితనవు,

త్రులకు సుఖముగల్గునుగదా. అందుకు సంజయుఁడెంత చక్కఁగను త్తరము చెప్పెనో చూడుఁడు. దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం; పాండవసైన్యమే వ్యూహాకారముగా నున్నదియని చెప్పుటచే యుద్ధత్యాగమున కవకాశ మెంతమాత్రమును లేదని వెంటనే చెప్పెను. అట్టిసమయంబున దుర్యోధనుం డుత్సాహముతో నుండినను ధృతరాష్ట్రునకుఁ గొంతయుత్సాహమునకవకాశముం డునుగదా. సంజయుఁడు సత్యమును జెప్పుట ప్రధానముగాఁగల వాఁడగుటచే ధృతరాష్ట్రునికి నుత్సాహము కలిగిననుసరే క లుగకపోయినను సరే యనిదుర్యోధనుని యాథార్థ్యమునే చె ప్పినాఁడు గాని వేఱొండు ముఖప్రీతి వాక్యంబులు వలుకలేదు. దీనిచే సంజయునియొక్క నామంబు కేవలసార్థకనామంబుగాని పెట్టుపేరుగాదని తేటయగుచున్నది.

ఇంకనీయధ్యాయమున నగపడు పురుషుల గుణంబుల ను వారివారి నామంబులచేఁ దెలియనగునది. ఇందలిపురుష లనలంకరించు నామంబులు దుర్యోధనసంజయ నామంబులట్లు సార్థకనామంబులును పౌరుషనామంబులునుగాని కేవలము ముద్దుచే బెట్టఁబడిన నేతిబీరకాయ నామంబులు గావు. ఇందుకు దృష్టాంతముగా భీష్మునిగుఱించి యొకింత విచారింతము. భీష్ముఁ డను నామంబు పౌరుషనామంబు. ఈతని పితృవాంఛను దీర్చ

వివాహమును జేసికొనననిశపథముగావించె. అట్టిశపథమునుండిమ
రలింపవలెనని యాతనిగురుండగు పరశురాముండు నయంబున
ను భయంబునను బెదరించెను. అట్టిబెదరింపులసరకుగొనక శ
పథమును నిల్పుకొనుటయందు స్థిరుఁడగుటంజేసి పరశురాముం
డు గినిసి యుద్ధమునడిగొనఁగ నాతనితో ననన్యమగు యుద్ధము
నుగూడఁజేసి తనశపథమునందునిలిచె. పరిణయముఁజేసికొన
క యఖండ బ్రహ్మచర్యంబున భీష్మించెఁగావున నీయనకు భీ
ష్మండు భీష్మాచార్యుండను పౌరుషనామంబులుగల్గె. ఆతీరున
నె యిందునచ్చు నామంబులన్నియును పౌరుషనామంబులనియు
నవ్వానిచే నలంకరింపఁబడు పురుషులగుణంబులు దెలియనగున
నియును దెలియునది. అట్టివారల గుణంబుల విమర్శనంబు
ప్రకృతమున కనుపయోగమగుటచేతనే వారలు నామంబుల
చేమాత్రంబు పేర్కొనఁబడిరి. ప్రకృతమునకు నర్జునుగుణం
బు లుపయుక్తంబగుటచే నాతనిగుణంబులఁ బూర్ణంబుగవ్యక్త
ముఁజేయ నియ్యధ్యాయంబుప్రవర్తించెనని యిదివఱకెఁ జెప్ప
బడియెఁగదా! దానంజేసియిఁకనర్జునుని గుణవిమర్శనంబుఁ జే
యుదము.

అర్జునుండు.

శ్రీకృష్ణభగవాను లర్జునునకు నుత్కృష్టమగు బ్రహ్మ
విద్య నుపదేశించెనని యు నట్టిబ్రహ్మవిద్యకు సాధనచతుష్టయ

పరిపన్నుం డధికారియనియుఁ దెలిసినయంశమే. అయితే శ్రీ కృష్ణభగవాను డర్జునునియందీ యుత్తమగుణంబుల నెట్లుగ స్పష్టిచెనో యీయధ్యాయమం దర్జునకృతవాక్యంబులఁ దీసి విమర్శింతము. పల్కులను విమర్శించుటకుఁ బూర్వ మవస్థావిశేషమునుగూర్చి ముచ్చటించుట యావశ్యకము. ధర్మక్షేత్రంబైన కురుక్షేత్రంబునఁ గురుపాండవసైన్యములు రెండును వ్యూహాకారముగా నేర్పఱుపఁబడి యుభయసైన్యములవారిచే యుద్ధప్రారంభసూచకంబుగ శంఖకాహళభేరీమృదంగాది వాద్యధ్వనులు చేయబడి, శరవర్షంబులు గురియుట ప్రారంభము కాఁగా నర్జునుండు విల్లెక్కువెట్టి, తనకు సారథ్యముఁ జేయుచున్న శ్రీకృష్ణభగవానులంగూర్చి యిట్లు పలికె.

"సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥ 1-21
యావదేతాన్నిరీక్షేహం యోద్ధుకామానవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ 1-22

ఓయి కృష్ణా యుద్ధము సేయవచ్చినవారలలో నెవ్వరితో నేను యుద్ధము చేయవలయునో యట్టివారల నేప్రదేశమునుండి బాగుగఁ జూడగలనో యట్టిప్రదేశమున నుభయ సేనలమధ్యభాగమున నారథమును నిలుపుము. అంత శ్రీకృష్ణులారథమునుభయసైన్యముల మధ్యమున నిలిపి. భీష్మద్రోణులు మొదలు

గాఁగల రాజులందఱును జూచుచుండ నీసమావేశమైన కౌరవులఁ జూడుమా యర్జునాయని పల్కె « పార్థఃపశ్యైతాన్సమవే. తాన్కురూన్ „ 1-25. అంతనర్జునుం డుభయసైన్యములం దునుండిన పితృపితామహాచార్యమాతుల భ్రాతృపుత్త్రపౌత్త్ర సుహృదసఖులసందఱను జూచియుత్కృష్టమైన కృపచే నావరిం పఁబడి శోకసాగరమగ్నుఁడై విలపించుచు శ్రీకృష్ణులతోఁ దన హృదయమును వెల్లడిచేయుచుఁ బల్కెనబల్కులె యర్జును సుగుణసంపదకుసాక్ష్యంబులు. అర్జునుం డుత్కృష్టమైన దయ ను బొందెననుటకు నాతనియవస్థయెసాక్షి. అర్జునుండు త నయవస్థ నిట్లుదెలుపుచున్నాఁడు :—

సీదంతిమమగాత్రాణి ముఖంచపరిశుష్యతి।
వేపథుశ్చశరీరేమేరోమహర్షశ్చజాయతే॥
గాండీవంస్రంసతేహస్తాత్ త్వక్చైవపరిదహ్యతే।
నచశక్నోమ్యవస్థాతుంభ్రమతీవచమేమనః॥ 1 29-30

«నాయవయవములు శిథిలములగుచున్నవి. నోరెండుచున్నది. దేహమువణకుచున్నది. వెండ్రుకలుగగుర్పాటుఁజెందుచున్నవి. చేతినుండిగాండీవముజారుచున్నది. అంతస్తాపముగలుగుచున్నయ ది. శరీరమునుధరించుటకు నశక్తుఁడనగుచున్నాఁడను. మనంబు భ్రమఁజెందుచున్నది. పల్కులనుండిమాంతర్యగుణంబుల గ్రి

హింపవలయునన్నచో నిట్టియవస్థయందలి పల్కులనుండిగాక యున్నచో వేఱొకయవస్థయందలిపల్కులుప్రమాణాత్మంబులగునే! ఇట్టిభయంకరమగునవస్థయం దర్జునుండుముస్గుటకుఁగారణంబు తాఁజేయఁబోవు కార్యముంగూర్చి పౌర్వాపర్యవిమర్శనంబుఁజేయుటయె. అర్జునుండు జరగఁబోవుయుద్ధమువలన ఫలితంబుల ముచ్చటించి యిట్టియుద్ధమువలన నిహాపరంబుల రెంటికి నేగాక నుత్కృష్టతమంబగు పురుషార్థంబగు మోక్షంబునకుఁగూడ భంగంబుగల్గునను మహాభయమును నొందుటంజేసియె యిట్టిశరీరకంపనాదివికారంబు లాతని జెందుట. అప్పుడర్జునుండు గర్తవ్యంబును నిశ్చయింపఁజాలక సందియంబులు దీర్చితరింపఁజేయుఁడనుచు శ్రీకృష్ణభగవానులతోఁదనసందియంబుల సహేతుకంబుగముచ్చటించుచున్నాఁడు. అర్జునుండు సందేహాస్పదుఁడైనట్లు «భ్రమతీవచమేమనః» యనువాక్యమువలనఁదేటయగుచున్నది.

అర్జునుండు పొందిన శోకమునకు నుత్కృష్టమైన కృపయే కారణమని యేల చెప్పవలయును? సంజయుఁడు «కృపయాపరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్,» అని చెప్పినంతనే ప్రామాణ్యమా? తప్పక ప్రామాణ్యంబె. ఏమీ యర్జునుండు పరాక్రమవంతులు నుత్కృష్టతములనగు భీష్మద్రోణాదులతో యుద్ధ

ము సేయఁబాలననుభయముచే శోకముఁ జెందఁగూడదా ? ఓయి వెఱ్ఱివాఁడా! అర్జునుండు స్వసామర్థ్యమును గుర్తెఱుంగకయు ద్ధముఁ జేయ వచ్చినవాఁడుఁగాడు; ఇంక నాతఁడు యుద్ధముఁ జేయఁ జనుటకు నిదియె మొదటిపర్యాయముగాదు. అర్జునకృతపరాక్రమంబుల నెఱుంగవా ?గంధర్వులతోఁ గలహమాడి దుర్యోధ నువిడిపింప లేదా ? అప్పుడీద్రోణభీష్మ కర్ణాదు లేమిచేయుచుండిరి? మత్స్యయంత్రముఁగొట్టి ద్రౌపదినిబరిణయుంబుగా లేదా? ఈశ్వరునితోఁ బోరాడి పాశుపతంబును సంపాదింప లేదా ? గో గ్రహణంబులఁ గౌరవుల తలగుడ్డల నుత్తర బొమ్మలకై గొంపోవ లేదా ? దుప్రదుఁ దెచ్చి ద్రోణుపాదంబులఁ బడవేయ లేదా ? ఇట్లెన్ని మహాహవంబులఁ దనసామర్థ్యమును బ్రపంచమునకుఁ జూపియున్నాఁడు. అట్టియర్జునుండిప్పుడు యుద్ధమునకు వెఱపుఁ జెందునా? ఎంతమాత్రమునుగాదు. తనసామర్థ్యము చేయుద్ధమునందు బాంధవులుచచ్చెదరు. వార లాప్తులగుటచే వారలయందలి ప్రేమచే నీతఁడు సంజయుండు చెప్పినరీతిని దుఃఖముఁ జెందినవాఁడే కాని నీవుతలంచినట్లు యుద్ధభయమునఁగాదు. అతనిపల్కులు బాగుగఁజూడుము. ఎంతయుత్కృష్టమైన తలంపుల నాతఁడు దలంచియుండెనో తేటయగును.

అర్జునుండు జరగఁబోవు యుద్ధమునుగూర్చి యిట్లుపే

ల్కుచున్నాఁడు. "న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే" "స్వజనులను యుద్ధమందుఁ జంపినపిమ్మట శ్రేయస్సును నేనుగనను" అను నిట్టి స్వజనవధచే శ్రేయస్సెంతమాత్రమును లభ్యముగాకపోవుటయేగాక యనర్థము వాటిల్లును. ఇందు శ్రేయస్సన నెద్దియో తెన్నగా విమర్శింపవలయు. ఏలయన నంతఃకరణధర్మంబులంబట్టియు జ్ఞానతారతమ్యముంబట్టియు జనుల యుద్దేశంబులు భిన్నంబులుగనుండు. దానంజేసి వారల శ్రేయస్సువారి యుద్దేశంబుల ననుసరించియుండు. అధికారితారతమ్యము జ్ఞానతారతమ్యము ననుసరించియుండు. జ్ఞానతారతమ్యంబుచే శ్రేయస్సునకు మూఁడువిధంబులగు నర్థంబులనీయవచ్చు.

౧. నిత్యానిత్యవస్తువివేకజ్ఞానవంతునకు నుత్కృష్టతమంబగుపురుషార్థంబగు మోక్షము శ్రేయస్సుగాఁదోఁచు.

౨ ఐహికసుఖంబులకంటె నాముష్మికంబులుత్కృష్టంబులును శాశ్వతంబులునని యోజించు పురుషునకు స్వర్గాద్యుత్తమలోకప్రాప్తి శ్రేయస్సుగాఁదోఁచు.

3. పారమార్థికజ్ఞానంబించుకేనియులేక విషయసుఖంబులెయెక్కుడనియెంచు పశుతుల్యుండగు పామరునకు నిహసౌఖ్యంబులగు స్రక్చందనవనితాదిభోగంబులు శ్రేయస్సుగాఁదోఁచు.

ఇందు మొదటితరగతివాఁడు ముముక్షువని చెప్పంబడును. రెం
డవతరగతివాఁడు స్వర్గాపేక్షితుండనంబడు. మూఁడవతరగతి
వాఁడు లోకాయతికుఁడనంబడు. ఈమూఁడుతరగతులయందు
అర్జునుఁడేతరగతిలోఁ జేరునో చూతము. అర్జునుండు లోకాయతి
కుండగునా? లోకాయతికుఁడనఁగ నైహికసుఖంబుల నపేక్షిం
చువాఁడుగదా! ఐహికసుఖంబులందు భూమండలాధిపత్యం
బుకంటె వేఱొండు లేదుగదా? అర్జునుం డైహికసుఖంబులలో
నుత్కృష్టతమంబగు రాజ్యంబులోనగు వానినెంతమాత్రము
నపేక్షింపనని కంఠోక్తిగఁ జెప్పుచున్నాఁడు.

"నకాంక్షేవిజయం కృష్ణనచరాజ్యంసుఖానిచ" 1-32.

పోనిం డర్జునుండు స్వర్గాపేక్షితుండనియెదము.
స్వర్గాపేక్షితునకు నింద్రాధిపత్యంబగు త్రిలోకాధిపత్యంబుకం
టె నెక్కుడు లేదుగదా? అర్జునుండట్టి త్రిలోకాధిపత్యమును
దిరస్కరించుచున్నాఁడు. "అపిత్రైలోక్యరాజ్యస్య హేతోః కిం
న్నుమహీకృతే॥ 1-35.

ఇంకనర్జునుండేను కావలయును? నిత్యానిత్యవస్తువివేకముఁగ
ల్గిన ముముక్షువుగావలయును. లేకుండినచో నైహికాము
ష్మిక సౌఖ్యంబులకుఁబ్రతిష్ఠానంబును క్షాత్రధర్మంబునగు యుద్ధ
మును దిరస్కరింపకపోవును అర్జునుఁడీ యుద్ధమును గార్చి

పడినయభిప్రాయంబెట్టిదియన:—"తద్యథేహకర్మచితోలోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితోలోకః క్షీయత ,, ఈలోకమునఁ గృష్యాదికర్మములచేసంపాదింపఁబడినసస్యాదిభోగ్యములెట్లు నశ్వరంబులోయారీతినె పుణ్యకర్మముచే సంపాదింపఁబడు నాముష్మికఫలంబులు నశ్వరంబులనుశ్రుతియుక్తంబగు" యత్కృతకంతదనిత్యం,, "ఏదిచేయఁబడుచున్నదో యదియనిత్యము ,, అనుయుక్తిచే శాశ్వతమగు మోక్షము కర్మముచేనలవడదని తెలియవచ్చుచున్నదిగదా? అట్టిసమయంబునఁ గ్రూరకర్మంబైననీస్వజనవధారూపంబగుకర్మముచేమోక్షమెట్లు గలుగును? గావున నీస్వజనవధారూపంబగుయుద్ధమశ్రేయస్కరము.

ఇంతియేకాకుండఁ గేవలము లోకాయతికుని తలంపున యోజించిన నీయుద్ధమశ్రేయస్కరంబుగాని శ్రేయస్కరము గాదు. ఏలయన లోకాయతికుండు బంధుపుత్త్రాదిసుఖాపేక్షితుండైకదా రాజ్యమును బడయఁగోరును. ఎవ్వరియొక్క శ్రేయస్సు నపేక్షించి రాజ్యభోగసుఖాదులను మనముకోరుదుమో యట్టి బంధుపుత్త్రమిత్త్రాదులందఱును ప్రాణధనములందు నాశనువిడచి యుద్ధమునందు నిలిచియున్నారలు.

"ఏషామర్థే కాంక్షితంనోరాజ్యంభోగాస్సుఖానిచ।
తఇమేవస్థితాయుద్ధే ప్రాణాంస్త్యక్త్వాధనానిచ॥

ఆచార్యాః పితరః పుత్రాస్తథైవచపితామహాః।
మాతులాః శ్వసురాః పౌత్రాః శ్యాలాస్సంబంధినస్తథా॥
(1-33-34)

ఈ హేతువుచే " అకార్యశతంకృత్వాభర్తవ్యా " ఇత్యాదికార్యసాధనవాదివాక్యంబులుగూడ దిరస్కరింపఁబడుచున్నవి. దుర్యోధనులాతతాయినులు " ఆతతాయినమాయాన్తంహన్యాదేవావిచారయన్ " అనుధర్మశాస్త్రోక్తి ననుసరించి క్షత్రియుల మగు మనకు వీరలనుజంపుట యుక్తధర్మమనినచో నందును గూడ నొకగొప్పదోషము గలదనుతలంపున నిట్లుచెప్పుచున్నాఁడు.

"పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః"
ఏలయన వీర లాతతాయినులైనను, మనకునన్నదమ్ములు. ఆతతాయిని వధింపకుండుటంజేసి సంభవించుపాపముకంటె భ్రాతృవధచేఁఘటిల్లు పాపమెక్కుడుగావున నీయుద్ధ మశ్రేయస్కరము. ఇంకనీయుద్ధమునలనఁ గులక్షయకృతదోషము, మిత్రద్రోహపాతకము వాటిల్లు. కులక్షయమువలన మనముహానినిఁజెందుటయేగాక, లోకమును జెఱచి యుత్కృష్టలోకములంజేరిన పితరులనుగూడ నధోలోకంబునఁద్రోయువారల మగుదుము. ఇట్టిపాతకంబుల మెడఁగట్టుకొనినవారలకు నెల్లప్పుడును నరక

బుననే నివాసము సంప్రాప్తమగునని పెద్దలవలనను శాస్త్రములవలనను వినుచున్నాము.

"ఉత్సన్నకులధర్మాణాంమనుష్యాణాంజనార్దన,,
నరకేనియతం వాసోభవతీత్యనుశుశ్రుమ (1-44)

గావున నెవ్విధంబున నాలోచించిచూచిన నీస్వజనవధారూపంబగు యుద్ధము శ్రేయస్కరముగావున నెంతమాత్రమును జేయనర్హముగాదు. అని చెప్పుటలో నీయుద్ధముమునకువునకే గాక నితరులకునుగూడ శ్రేయస్సును సంపాదింపదని లెస్సగాఁ జెప్పియున్నాఁడు. ఈయుద్ధము శ్రేయోదాయకముగాదని చెప్పుటచే నీతఁడు నిత్యానిత్య వస్తువివేకమును గల్గియున్నాఁడని తెలియవచ్చుచున్నది.

"నకాంక్షేవిజయంకృష్ణనచరాజ్యంసుఖానిచ,, యని చెప్పుటచేనీతఁడైహికసుఖంబులందు వైరాగ్యముఁజెందియున్నటులను "అపిత్రైలోక్యరాజ్యస్య హేతోఃకిన్నుమహీకృతే,, యని చెప్పుటంజేసి నిహాముత్రార్థఫలభోగవిరాగంబును గల్గియున్నటుల వ్యక్తమగుచున్నది. ఇట్టివిరాగము నర్జునుండు పూర్ణముగాఁగల్గిమోక్ష సాధనమగు బ్రహ్మవిద్యను దక్కవేఱొండు శ్రేయస్సుగాఁ దలంచలేదని

"నహిప్రపశ్యామిమమాపనుద్యాద్యచ్ఛోకముచ్ఛోషణమిం

ద్రియాణాం। అవాప్య భూమావసపత్న మృద్ధం రాజ్యం సురా ణామపిచాధిపత్యం॥

ఇప్పుడునాడు నింద్రియములకు సంతాపమును గలుగc జేసిన విషాదము పూర్ణమగుభూమండలాధిపత్యమును గాని త్రిలోకాధిపత్యంబైనయిందాధిపత్యమును గాని నేcబొందినను నన్ను విడువదు. అని చెప్పుటచే నీతని విషాదమునకు యుద్ధము నందలి జయసంపాదనా సాధనము నందలిలోప మని యెంతమాత్రమునుదలంపనవకాశము లేదుగదా!

ఇంతవఱకు నర్జుననియందు నిత్యానిత్య వస్తువివేకమును, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగమును విమర్శించితిమి. ఇcకశమాది షట్కంబును గూర్చి యోజింతము. "కింనోరాజ్యేనగోవిందకింభోగైర్జీవితేనవా" 1-32 అనియర్జునుండు చెప్పుచున్నాcడు. రాజ్యము లౌకికవ్యాపారముగదా. రాజ్యము వలనిప్రయోజనము మనకేద్దియును లేదన లౌకికవ్యాపారమువలని ప్రయోజనము మనకేద్దియును లేదని వ్యక్తమగుచున్నది. లౌకికవ్యాపారములనుండి మనస్సును మరలించుటయే శమంబనంబడును.

ఇcకభోగములవలనను జీవనమువలనను బ్రయోజనము లేదని బాహ్యకరణంబులగు భోగములను జీవనములనుని

రసించుచున్నాఁడు. ఇట్టిబాహ్య కరణములనుండి మనంబునుమ రలించుటయే దమమనంబడును.

« ఏతాన్నహంతుమిచ్ఛామిఘ్నతో౽పిమధుసూదన,, 1. 35

«యదిమామప్రతీకారమశస్త్రంశస్త్రపాణయః।

ధార్తరాష్ట్రారణేహన్యు స్తన్మేక్షేమతరంభవేత్॥ 1. 46

ఓయిశ్రీకృష్ణా నేనుగొట్టఁబడినప్పటికినివీరలనుజంపుట కొఱకు నేనిచ్ఛగింపను. శస్త్రములేనట్టియుఁ బ్రతీకారమునో నర్పనట్టియు నన్నా యుధపాణులైన దుర్యోధనాదులు యుద్ధమునందుఁజంపిన నదినాకు క్షేమకరంబగును. అనిదుఃఖసహనము నుబ్రకటించుచున్నాఁడు. ఇట్టిసహనంబుకంటె వేఱొండు తితీక్షగలదె ?

« యద్యప్యే తేనపశ్యంతిలోభోపహతచేతసః ,,

లోభముచే నావరింపఁబడిన స్వభావము గలవారగుట చేదుర్యోధనాదు లీసంచిచెడ్డల నెంతమాత్రమును గని పెట్టఁజాలరైరి. అనిదుర్యోధనాదుల యవివేకమునకు లోభత్వము ను గారణముగా స్వీకరించుటచేత నీతనియందట్టి దుర్గుణము లేదని వ్యక్తమగుచున్నది. మహానుభావులెవ్వరును దమస్వభావంబుల గుర్తెఱుంగకుండ నొరుల నిందింపరుగదా? కావున నర్జునుండునిర్లోభత్వముచేనలంకరింపఁబడినవాఁడని తెలియనగు.

" ప్రివృత్తేశస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః "
" గాండీవంస్రంసతేహస్తాత్ "

అనువాక్యములచే నీతఁడు యుద్ధారంభంబున విల్లునెక్కువెట్టి చేఁబూనెనని తెలియవచ్చుచున్నది "యదిమామప్రతీకారమశస్త్రం" అని యర్జునుండుతన్ను నిరాయుధునిగాఁ దెల్పుకొనుచున్నాఁడు. దీనిచేతనీతఁడుయుద్ధముఁజేయఁజేఁబూనినధనుస్సును విడనాడినట్లు తెల్లమగుచున్నది. ఈవిషయమునే సంజయుఁడు గూడ నిట్లని చెప్పుచున్నాఁడు.

" ఏవముక్త్వార్జునస్సంఖ్యేరథోపస్థఉపావిశత్।
విసృజ్యసశరం చాపం శోకసంవిగ్నమానసః॥ 1- 47

క్షత్రియునకు యుద్ధము నియతకర్మము అట్టికర్మమునకు సాధనము ధనుస్సు. కర్మమునకుసాధనంబయిన ధనుస్సును విడనాడుట నియతమైన కర్మమునువిడిచినసూచనగావునఁనర్జునుఁడు జ్ఞానార్థము నియతమగు కర్మత్యాగమును జేసెనని తెలియనగును. జ్ఞానార్థము విహితమయిన నిత్యాదికర్మ సన్యాస ముపరతియనంబడు.

అట్టునుం డుత్కృష్టమైన కృపవలని విషాదముచే నస్త్రసన్యాసముుంజేసి కన్నులనీరునించుచు రథముపైఁ గూర్చుండ శ్రీకృష్ణభగవానులు పరిహాసముగ నిట్లుపల్కె.

" కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితం।
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున।
క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥ II-2,3

శ్రీకృష్ణభగవాను లిట్లుపల్కుటకుఁ గారణము నొకింత చూతుము.

శ్రీకృష్ణభగవానులర్జునునియందు నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమదమతితిక్షలు, నిర్లోభత్వము, ఉపరతి యనుగుణంబులఁజూచి తత్త్వము నుపదేశించుటకు వలయుగుణంబులలో గురూపసదనము, ముముక్షుత్వంబుఁ గొఱఁతగాఁ దోఁప నాగుణంబులీతనియందుఁ గనుఁగొనుటకై యాతని మాటల సరకుగొననటులనో యర్జునా నీకువిచారమెట్లుకల్గెనో తెలియకున్నయది. ఒకవేళ నీవిచార ముత్కృష్టంబని తలంచెదమన్ననో యియ్యది యవివేకులను బొందునట్టిదియుఁ బరలోకమునకు హానియునిహలోకమున నపయశస్సును సంపాదించునదియై యున్నది. కావున నీక్షుద్రమైన క్లైబ్యత్వము మమాని యుద్ధముఁ జేయుమని యుద్ధముఁ జేయుటకు వెఱపుఁ జెందినవాని నూరడించినట్లు పలుకుచున్నారు. ఇట్టి శ్రీకృష్ణభగవానుల వాక్యములకు నర్జునుండుత్తరము చెప్పుటలోఁ బల్కినపల్కులు:—

"గురూనహత్వాహి మహానుభావాన్ శ్రేయోభోక్తుం భైక్షమపీహలోకే॥ II-5.

మహానుభావులైన గురువులనుజంపకుండ నీలోకమునందు భిక్షాశనమును భుజించుట శ్రేయము. అర్జునుండు మోక్షైకకాములగు యతిపుంగవులనుసరించు భిక్షాచర్యమునందు శ్రేయస్సాధనబుద్ధిని బొందియున్నాఁడు. కావున "వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరంతి" శ్రుతిసిద్ధమైనముముక్షుత్వమును గల్గియున్నాఁడని వేఱ వచింప నక్కఱలేదు.

"కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామిత్వాం ధర్మసమ్మూఢచేతాః। యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితంబ్రూహి శిష్య స్తేஉహం శాధిమాంత్వాం ప్రపన్నం॥

కార్పణ్యదోషోపహతస్వభావః = అవిద్యాకృతదేహేంద్రియాద్యనాత్మనః స్వరూప మిదమేవ అహమితి వ్యవహారతీతి కృపణః

కృపణః = అతత్త్వజ్ఞః॥ అవిద్యవలనఁ గల్గినదేహేంద్రియాదిసంఘాత మగు ననాత్మయందహంభావమునుగల్గిన యవివేకి. అట్టికృపణునియొక్క స్వభావము కార్పణ్యము. ఇందుకు శ్రు॥ "యోవాఏతదక్షరంగార్గ్యవిదిత్వాஉస్మాల్లోకాత్ప్రైతి సకృపణః॥.

కార్పణ్యదోషోపహతస్వభావః = అవిద్యచేనాత్మస్వభావము నెఱుంగని స్వభావము గలవాఁడు.
ధర్మసమ్మూఢచేతాః = కార్యాకార్య వివేకమునందుసందేహమునొందినవాఁడు.
శిష్యస్తేఽహం = నేను నీకు శిష్యుఁడను.
మాంశాధి = నన్ను రక్షింపుము.
నే నవిద్యావాసనచేఁ దిరోహితమైన జ్ఞానమునుగలవాఁడను. ధర్మాధర్మవివేకమునందు సంశయముఁ జెందినవాఁడను. గావున శ్రేయస్స్యాద్నిశ్చితం నిశ్చయముగఁ జెప్పుఁడు. ఒకవేళ "నాపుత్రాయ శిష్యాయ వైపునః" ఇత్యాదివాక్యంబులచేఁబుత్రశిష్యులకంటె నన్యులకు రహస్య మనియెంచితేని నేనుజ్ఞానార్థి నినైన శిష్యుఁడను. జగద్గురుండవగు నిన్ను శరణంబు వేఁడెద నన్నురక్షింపుము.

"నహి ప్రపశ్యామి మమాపనుద్యాద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణాం॥ అవాప్యభూమావసపత్నమృద్ధం రాజ్యం సురాణామపిచాధిపత్యం॥ "II-8

సాటిలేని భూలోకరాజ్యముగాని ఇంద్రాధిపత్యముగాని నాయింద్రియములకు సంతాపమును గలుగఁజేసిన శోకమును దొలఁగింపఁజాలదు. కావున నావిషాదమును బోఁగొట్టి శ్రేయ

స్సును నిశ్చయముగఁజూపుము.

ఇందు మొదటిశ్లోకముచే నర్జునునికి శ్రీకృష్ణభగవానుల యందుఁగల బ్రామాణ్య జ్ఞానము వెల్లడియగుచున్నది.

రెండవశ్లోకముచే నర్జునునితలంపున నిహాముత్రార్థఫలంబులు శ్రేయస్సుగాదని తేటయగుచున్నది.

"నచ శ్రేయోను పశ్యామిహత్వాస్వ జనమాహవే" యనుశ్లోకమాదిగ "నహిప్రపశ్యామి మమాపనుద్యాత్" యనుశ్లోకాంతమువఱకునుగల యర్జునకృతవాక్యంబులవిమర్శించినఁ దెలినసారాంశమెద్దియన నర్జునుండు 1 నిత్యానిత్య వస్తు వివేకము 2 ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము 3 శమదమతితిక్షనిర్లోభత్వగురూపసదనోప రతులను షడ్గుణంబులు 4 ముముక్షుత్వము అను సాధన చతుష్టయ సంపన్నుండనియు నీతఁడుత్కృష్టతమంబగు శ్రేయస్సునుబొందించు బ్రహ్మజ్ఞానమును బ్రసాదింపుఁడని శ్రీకృష్ణభగవానులను బ్రార్థించుచున్నాఁడనియు దేటతెల్లమగుచున్నది.

సదసద్వివేకమువలనఁ గలిగిన తీవ్రవైరాగ్యముచేముముక్షువు సర్వకర్మసన్యాసంబుగావించి మోక్షైకకాముండై యట్టిమోక్షమునకు మార్గము దెలియమికి ఖేదమునొందుచు దానిని దెలిసికొన శ్రోత్రియుఁడును బ్రహ్మనిష్ఠుండునగు సద్గు

రువుకడకు శ్రద్ధాభక్తి పురస్సరంబుగఁబత్రపుష్ప ఫలాదులతో నైద్దానినయినఁ జేపట్టి పోవలయునని శాసించు « పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణోనిర్వేద మాయానాస్త్యకృతః కృతతద్విజ్ఞానార్థంసగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణింశ్రోత్రియం బ్రహ్మనిష్ఠం» శ్రుత్యుక్తధర్మముయొక్కమూర్తీభావమోయను నట్లర్జునుండు శ్రీకృష్ణభగవానులకడఁజేరి « సోహంభగవఞ్ఛోచామితంమా భగవాన్ఛోకస్య పారంతారయతు» యను శ్రుతిపల్కురీతిని దీవ్రమగునపేక్షనుసూచించు నశ్రుపూర్ణాక్షుఁడైనిలిచె. చూచితివా ప్రప్రథమంబున ధృతరాష్ట్రునిచేఁ బలుకఁబడిన «ధర్మక్షేత్రే» యనుపదమందలి గర్భితాభిప్రాయ మెట్లుబుజువుచేయఁబడెనో అర్జునున కెట్లుత్కృష్టమగుదయము సాధనచతుష్టయసంపదయు నుదయించెనో అయితేయట్టి సాధన చతుష్టయసంపద స్థలమాహాత్మ్యంబువలన నుద్భవించెనేని అందఱకు నేలయుద్భవింపఁగూడదు. అనుచోనట్టిగుణమున కనుగుణంబగు సంస్కారంబు లంతఃకరణంబున నున్నచోనవి మొలకలెత్తి పెరుగును. గాని సంస్కారంబు లేనిపురుషునం దుత్పత్తిగానేరవని యెఱుంగునది. సుసంస్కారంబులుగలవానికిసంసర్గవశంబునఁజేసి పుణ్యక్షేత్ర దర్శనంబునను బుణ్యాపురుష దర్శనంబునను నుత్కృష్టతమంబగు గుణంబులుద్భవించు.

పైవిమర్శనంబునఁ దెలియవచ్చిన దేమనఁ నీగ్రంథాదియం ద
ధికారినిరూపణంబు చేయఁబడెఁ గావున నీశాస్త్రము పాదేయంబు.

ఇయ్యధ్యాయం బధికారి నిరూపణంబునకై ప్రవర్తించిన
చో నియ్యది «అధికారినిరూపణం,, బను నామంబుచే నలంకరింపఁ
బడవలయును. అర్జునవిషాదయోగమని పెద్దలచే వ్యవహరిం
పఁబడుచు నర్జును దుఃఖవర్ణనంబును జేయు నధ్యాయంబునంద
లి పదంబులఁ గొన్నింటిని జేకొని యెద్దియో యొకతీరున గాంభీ
ర్యంబుచే నర్థంబులఁ బ్రతిపాదించుచు నధికారనిరూపణంబున
కై నియమింపఁబడినదని చెప్పుట సాహసమాత్రము. పెద్దలచే
ననాదినుండి నర్జునవిషాదయోగ మను సార్థకనామంబును బ
డసిన దేయనిన:—

ఓయి వెఱ్ఱివాఁడా! ఏలయింత పూర్వాపరపరామర్శనంబులే
కుండ తొందరపాటునఁ బల్కుచున్నావు. పెద్దలు తెలివిలే
మిచే నర్జునవిషాదయోగమని పేరుపెట్టిరి. వాస్తవముచే న
ధికారినిరూపణమని యుండవలయునని చెప్పితివా? అర్జున
విషాదయోగమని పేరిడుటయందే యధికారి నిరూపణమనున
భిప్రాయంబును గల్గియే పెద్దలీనామమున్నిడిరి. ఓహోహో! ఏ
మి వింత! క్రొత్త నిఘంటువును గూడ వ్రాయఁ దలంచితివా? అ
ర్జునవిషాదమన్న నధికారినిరూపణమా? తొందరపడకయా

లింపుము. పెద్దలుదీని నర్జునవిషాదయోగమనిరిగాని యర్జున విషాదమన లేదు. ఈనామంబునందలి సొగసంతయు యోగశ బ్దమునందున్న యది. యోగశబ్దమునకు సాధన మర్థమని సామాన్యముగ స్వీకరించునది. కొంచెమువిచారింతము. యోగ మనసాధనము. అర్జునివిషాదయోగమన నర్జునవిషాదమనెడి సాధనము. ఎందుకు? మోక్షమునకు సాక్షాత్సాధనమగుజ్ఞానమునకు. ఆహా! అతిచిత్రముగానున్నది. అర్జునవిషాదము జ్ఞానమునకు సాధనం బగునా? ఆ. వాస్తవముగానర్జునవిషాదము జ్ఞానసాధనంబె. అర్జునునకు విషాదమేటికిఁగల్గె « కృప యాపరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్ „ ఉత్కృష్టమైన కృప చే నావరింపఁబడి విచారించుచు నిట్లుపల్కె నననీవిషాదము నకు నుత్కృష్టమైనకృప కారణమని తేటయగుచున్నది. ఇట్టి యుత్కృష్టమైనకృప యర్జునునకే యేలకలుగవలయు? సాధనచతుష్టయ సంపన్నుఁడగుటచే నాతనికిఁగల్గె. కావుననర్జున విషాదమన్నచో నట్టి విషాదమునకుఁ గారణంబగు సాధన చతుష్టయ సంపదను జహల్లక్షణముచే నర్థముగ గ్రహించునది. ఇప్పుడర్జున విషాదయోగమన్నఁ దేలినయర్థమునుజూతము. అర్జునవిషాదయోగము = గుణచతుష్టయసంపదయనెడు సాధనము-సాధనచతుష్టయసంపద జ్ఞానసాధనముగావున నట్టిగు

ణంబులచే నలంకరింపఁబడినవాఁడు బ్రహ్మవిద్యకు యుక్తమగు నధికారియని బుధులు వేయినోళ్లఁ బల్కుచున్నారుగదా? వాస్తవముచే నర్జుననకు సాధనచతుష్టయసంపదయీ విషాదకారణముగాకపోయిన నచ్చటఁ గురుక్షేత్రంబున యుద్ధసన్నద్ధులైన పదునెనిమిది యక్షౌహిణుల జనులలో నేరికైన నిట్టివిషాదముగల్గెనా? ధర్మరాజు మొదలగువారలు మహామహు లని చెప్పఁబడిరిగాని యట్టివారలకుఁగూడ నిట్టివిషాదముగలుగలేదు కద! ఇంకననేకమహామహు లనేకవిధంబుల విషాదముఁ జెందియుండలేదా? అట్టివారల విషాదంబుల యోగశబ్దముచేఁ బేర్కొనక యొక్కయర్జునవిషాదమునే యోగముగఁ బేర్కొనుటకుఁగలసరసభావమునై నఁజూతుము. ఏలయనవారలవిషాదమునకుసాధనచతుష్టయసంపద కారణంబుగాదు. పలువిధంబులగుకష్టములుకారణంబులు. అర్జునుండు పొందినవిషాదమువంటి విషాదము నెవ్వండు పొందినను వాఁడుధన్యుండె. వాఁడు శ్రేయస్సును బొందినవాఁడె.

ఎద్దియేని వస్తువునందెక్కుడు ప్రేమను జెందువాఁడట్టి వస్తుసంపాదనంబునకై పలువిధముల విలపించుట లోకసహజంబేకద? అట్టివిషయంబున నుత్కృష్టతమంబగు జ్ఞానసంపాదనంబునకు

దుఃఖించుట యొకవింతగాదు. బ్రహ్మజ్ఞానమును గుర్తెఱుంగు టకై పరితాపముఁజెంది విలపించినట్టి పురుషులచారిత్రంబులు గ్రంథంబుల నలంకరించుచుఁ బెక్కుఱుగానంబడుచున్నవి. అందునారదుని చార్రిత్రమును గొంచెమిచ్చట నిరూపించెదము. నారదుండు నాలుగువేదములను, చతుష్షష్టివిద్యలను బూర్ణ ముగా నభ్యసించి త్రిలోకసంచారమును జేయనవకాశమిచ్చు శక్తులతోనలంకరింపఁబడిన బ్రహ్మమానస పుత్రుండు. ఈతఁడు తనసామర్థ్యమునకు గర్వమును జెంది మూఁడులోకము లందును స్వేచ్ఛగ సంచరించుచు నొకనాఁడు సత్యలోకమున కుంజని సనకసనందనాదులు బ్రహ్మవిచారంబుఁజేయుచుండ న చ్చటికిఁజనియె. వారలీతఁడు గర్విష్ఠి దురహంకారుఁడుగా వున బ్రహ్మవిద్యను వినుటకు ననర్హుఁడని యెంచి, తమ గ్రంథంబులమూసి, విచారణమునుమాని, లోకోత్తరంబులైన ముచ్చటలచేఁ గాలంబు పుచ్చుచు నాతనిసరకుగొనకయుండిరి. అంతనాతఁడు తనకుఁగల్గిన పరాభవంబునకు వారలపైఁగినిసి తండ్రియైన బ్రహ్మకడకుఁబోయి « నాయనా!సనకసనందనాదులు తమబ్రహ్మవిచారంబును మాని నాకుఁబరాభవంబు గావించిరి » యని చెప్పనాతండు నీకుపనయనంబుగా లేదు కావుననన ద్యుఁడవగుటఁజేసి వారలుబ్రహ్మవిచారంబును మానిరియని ప్రి

త్యుత్తర మీయ నారదుం డట్టి యుపనయనంబును జేయుమన్న
నా బ్రహ్మదేవుం డట్టి యుపనయనంబు సనకసనందనా దులకడ
కుం బోయి చేసికొనుమని చెప్పె. అంత నారదుండు మరలసనక
సనందనాదులకడకుం జని నాకు నుపనయనంబుం జేయవలయు
నని మా నాయన మీకు నానతిచ్చెం గావున నుపనయనంబు
సేయుండనిన, మీ నాయన చెప్పినం జెప్పుఁగాక మేము చేయము పొ
మ్మనిరి. పిమ్మట నారదుండు వెక్కిలికోపముతో బ్రహ్మకడకుం
బోయి నాయనా! వారలు నీయానతి నుల్లంఘించి యుపనయన
ముం జేయము పొమ్మని రని చెప్పనప్పుడు బ్రహ్మదేవుండు నవ్వి
“ పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా
న్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్సమి
త్పాణిం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం ,, ఇత్యాది శ్రుతిచోదితం
బైన గురూపసదనంబు నుపదేశించి పిమ్మట సనకసనందనాదు
లకడకుం బొమ్మన నాతఁడతిఖిన్నుండై తనయజ్ఞానమునకుం జిం
తిల్లుచు సనకసనందనాదు లనుగ్రహింపుదురో లేదో యనివిల
పించుచు వారలకడకుం జని“ శ్రుతంహ్యేవ మేభగవద్దృశేభ్యస్త
రతి శోకమాత్మవిదితి సోహంభగవన్ శోచామితం మాభగవాం
ఛోకస్యపారం తారయతు ,, అని యేడ్వ వారిని పైఁ గరు
ణించి సనత్కుమారులు బ్రహ్మవిద్యోపదేశమును జేసిరన్ను

«తస్మిమ్మృదితకషాయాయతమసః పారందర్శయతి భగవాన్ సనత్కుమారః » అని శ్రుతిపల్కుచున్నయది.

ఇట్టివిషాదమును ముముక్షువులందఱును జెందినట్లు శ్రీరాములు, జనకులు, జానశ్రుతి, పరీక్షిత్తు, బుద్ధుఁడులోనుగాఁగల చారిత్రములచేఁ దేటతెల్లమగుచున్నది.

ఇంతవఱకుఁ జేసిన విమర్శనంబువలనఁ దేలిన సారాంశ ము ద్దియన నీగ్రంథస్థజ్ఞానమునకు సాధనచతుష్టయ సంపన్నుం డధికారియనియు నట్టియర్థము శ్రుతిచేఁ బ్రతిపాదింపఁబడిన యర్థము ననుసరించియున్నదనియును. ఇంతయేల బ్రహ్మవిద్యకు నధికారిని జెప్పుశ్రుతుల వ్యాఖ్యానమే యీయధ్యాయమని కంఠోక్తిగ వచింపనగు. కావుననధికారినిరూపకశ్రుతులకు నీయధ్యాయంబుతోడిగల సామరస్యము గొంతవఱకు నుత్సాహకరము. కావున దానిఁగొంచెమునిరూపించెదము. అధికారశ్రుతి« పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ »॥

కర్మముచేసంపాదింపఁబడిన లోకము లనిత్యములనినిశ్చయించి బ్రహ్మను దెలిసికొన నిచ్ఛయించిన ముముక్షువు, అకృతంబైనమోక్షము కర్మనుచేనలవడదని, వైరాగ్యమును జెంది

బ్రహ్మను దెలిసికొనుటకై గురువును బొందవలయును.

ప్రకృతమున నర్జునుఁడు యుద్ధరూపమగు కర్మముయొక్క ఫలములను విమర్శించెఁగదా? అట్లు విమర్శించుటయందు “పరీక్ష్యలోకాన్ కర్మచితాన్„ అను పదములచే వ్యక్తముచేయఁబడు కార్యమును నెరవేర్చినవాఁడయ్యె. అట్లు విమర్శించి తెలిసికొనిన తత్త్వము “నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే„ యనికదా. ఇట్టి తత్త్వము “నాస్త్యకృతః కృతేన„ యనుపదంబులచేఁ బ్రతిపాదింపఁబడు నర్థమైయున్నది. ఇచ్చట “హత్వా స్వజనమాహవే„ యనుయుద్ధరూపమగుకర్మముచేఁ గర్మసామాన్యమును స్వీకరించినచో నర్జునవాక్యమునకుఁ దేలునర్థమెద్దియనఁ “గర్మముచే శ్రేయస్సు లేదు„ అనికదా. శ్రేయస్సనఁగా నకృతంబైన మోక్షము. కావున శ్రుతియందలి “కృతేన„ అనుపదముయొక్క యభిప్రాయము “హత్వా స్వజనమాహవే„ యనుదానిచేతను “అకృతః„ యనుపదాభిప్రాయము “శ్రేయః„ అనుదానిచేతను “నాస్తి„ అనుదానియొక్క యభిప్రాయము “నపశ్యామి„ యనుదానిచేతను వ్యక్తముచేయఁబడుచున్నది. ఇట్లు తెలిసి గురునొద్దఁ జేరవలయునను రీతిని యర్జునుండు శ్రీకృష్ణునొద్దఁ జేరినట్లగపడుచున్నది. గురువును “సోఽహం భగవన్ శోచామి తం మా భగవాన్ శోకస్య పారం తారయతు,

అసి ప్రార్థింపవలయుననిశ్రుతి చెప్పిన యర్థమే "కా ర్పణ్యాదోషోపహతస్వభావః" "నహిప్రపశ్యామి మమాపను ద్యాత్" అనుశ్లోకములచే వెల్లడియగుచున్నది. కావున న చశ్రేయోనపశ్యామిహత్వాస్వజనమాహవే" యను నుపక్ర మవాక్యంబు మొదలు "అవాప్య భూమానసపత్నమృద్ధం రా జ్యంసురాణామపిచాధిపత్యం" అను నుపసంహారవాక్యమువఱ కును గలయర్థమును జూచినచో నస్యాదియంతయు నధికా రశ్రుతులచే వ్యక్తముఁజేయఁబడు భావార్థముయొక్క మూ ర్తిపంతమని తేటతెల్లమగును. దానంజేసి యర్జునుండు "ప రీక్ష్యలోకాన్" కర్మచితాన్ "సోహంభగవన్ శోచామి" ఇ త్యాదిశ్రుతులవలనను "సర్వధర్మాన్పరిత్యజ్యమామేకంశరణం వ్రజ" "తద్విద్ధి ప్రణిపాతేనపరిప్రశ్నేనసేవయా" "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యనుస్మృతులవలనను దెలియఁబడునధికా రమును బూర్ణంబుగఁగలిగియున్నాఁడు. కావునబ్రహ్మవిద్యకు యుక్తమగునధికారియని సిద్ధాంతమగుచున్నది. ఇట్టియధికా రమును శ్రీకృష్ణభగవానులు పరిశీలించి యర్జునునకుసుత్కృ ష్టతమంబగు బ్రహ్మవిద్యను నుపదేశించిరి. ఈబ్రహ్మవిద్య సాంఖ్యయోగమనుపేర రెండవయధ్యాయంబు నలంకరించియు న్నయది. శ్రీకృష్ణోపదిష్టతత్త్వ బును గుర్తెంఱుంగుటకై య

ద్దానిఁ గొంతవఱకుఁ జర్చింతము. ఈతత్త్వమునుగూర్చిముచ్చ టించుటకుఁబూర్వమీతత్త్వమునందు లోకమునఁగల భిన్నాభి ప్రాయంబులఁ గొంతవఱకు గుర్తెఱుంగుట యావశ్యకము.

## మతత్రయము.

ఆర్యావర్తంబున జ్ఞానంబును బ్రతిపాదించు గ్రంథము లు శ్రుతిస్మృతిపురాణేతిహాసరూపంబున వేనవేలుగానుండుటం జేసి, మహనీయులగు బుషు లందు సారభూతంబులగు గ్రంథత్రయమును దత్త్వము సర్వజనులకును సుకరంబుగ నలవడు టకుఁ బ్రామాణ్యములుగ నేర్పఱచిరి. అవియెవ్వియన:—ఈ శ కేన కఠప్రశ్నముండ మాండూక్య తైత్తిరీయఐతరేయఛాం దోగ్య బృహదారణ్యకంబులను పదియుపనిషత్తులును, సర్వ దర్శన శిరోభూషణంబగు వేదాంత దర్శనంబును, భగవ త్కృతంబైనయుపనిషద్వ్యాఖ్యానమోయని బుధులుగొనియా డ శ్రుతిస్మృతి రూపంబున లోకంబున నృత్యంబు పలుపు నీకృ ష్ణార్జున సంవాదరూపంబగు గీతాశాస్త్రంబును. ఈగ్రంథత్రి యంబనాదిగ నార్యావర్తంబునఁబవిత్రంబుగఁబూజింపఁబడుచు న్నది. ఆర్యావర్తంబునంగల వేదమార్గాను వర్తులెల్లరునీ

గ్రంథత్రయమును బరమప్రమాణంబుగా స్వీకరించుచున్నా రు. అట్లుండఁగ నీగ్రంథ రాజంబులఁబరమప్రమాణం బులుగస్వీకరించినను గ్రంథస్థజ్ఞానముఁగూర్చి కొంతవఱకు భిన్నాభిప్రాయంబులఁబొందియున్నారు. దానంజేసి యీగ్రంథత్రయంబు వలన ద్వైత,విశిష్టాద్వైత, అద్వైతంబులను మూఁడుమతంబులు గల్గె. మూఁడుమతంబులవారికిని గ్రంథప్రామాణ్యము చేతను, విధ్యుక్త శ్రౌతస్మార్త కర్మాచరణంబుచేతను, ఉపాసనావిధానంబుల చేతను, గోత్రములచేతను, మూలగురువులచేతను, బలువిధంబుల సామరస్యంబుగానవచ్చుచుండెడిని. కాని మతతత్త్వములందు భిన్నాభిప్రాయమును బొందియున్నారు. ద్వైతులీ గ్రంథత్రయము ద్వైతతత్త్వముఁ బ్రతిపాదించుచున్న దనియు విశిష్టాద్వైతులు విశిష్టాద్వైతతత్త్వమును బ్రతిపాదించు చున్నదనియు నద్వైతు లద్వైతతత్త్వమునుబ్రతిపాదించుచున్నదనియుఁ బలువిధంబులఁ దమతమ యభిప్రాయానుగుణంబుగ వ్యాఖ్యానంబుల నీగ్రంథ రాజంబులకుఁ గావించియున్నారు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతంబులచేఁ బ్రతిపాదింపఁబడు తత్త్వంబులఁ గొంచెము నిరూపించెదము.

ద్వైతతత్త్వము:- పురుషప్రకృతులకు భేదము. జీవేశ్వర భేదము. జీవనానాత్వము. ప్రకృతి సత్యత్వము. సంసారసత్యత్వము.

విశిష్టాద్వైతతత్త్వము:- ఈశ్వరుఁడు పురుషప్రకృత్యాత్మకము. దీనినేచిదచిద్విశిష్టమందురు. జీవేశ్వర భేదము. జీవనానాత్వము. సంసార సత్యత్వము.

ఉభయమతంబులందును అభిగమనోపాదానేజ్యాస్వాధ్యాయ యోగములచే వర్షశతం బారాధింప జీవులు విగత కల్మషులై యనంతకళ్యాణగుణపరిపూర్ణుండును సృష్టిస్థితిలయకర్తయునగు పరమేశ్వరుని సాన్నిధ్యమును బొందుదురని సిద్ధాంతము.

అద్వైతతత్త్వము:- జీవునియొక్కసాక్షిస్వరూపమేబ్రహ్మము. ప్రకృతిమిథ్య. బంధమసత్యము. జ్ఞానము మోక్ష సాధనము. ఈశ్వరస్వరూపము నిరవయవ నిర్గుణనిష్క్రియ సచ్చిదానందము.

ద్వైతవిశిష్టాద్వైతులు నిత్యమనినచోఁ బరిణామి నిత్యమును, నాశనమనినచో నవస్థాభేదమును స్వీకరించిరి. అద్వైతులన్ననో, నిత్యమన్నఁగూటస్థ నిత్యమును నాశనమన్న నధికరణాత్మకమనియు నంగీకరించిరి.

## ద్వైతవిశిష్టాద్వైతులు కర్మజ్ఞాన సముచ్చయవాదులు

మూఁడుమతములవారికిని బ్రధానమగువివాదాంశము ప్రకృతియొక్క స్వభావము. ప్రకృతిసత్యమని ద్వైతవిశిష్టాద్వైతులును మిథ్యయని యద్వైతులును బ్రతిపాదించుచున్నారు. ప్రకృతియొక్క స్వభావముననుసరించియే యితరవిషయములందు భేదములుగల్గుచున్నవి. ఇట్టియభిప్రాయభేదంబుల ననుసరించి భగవద్గీతకుఁగూడ మాధ్వ రామానుజ శంకరులు మువ్వురునుబ్రత్యేకంబుగమూఁడువ్యాఖ్యానంబులు గావించిరి. కావున నీగీతాతత్త్వ విమర్శనంబున మువ్వురియభిప్రాయంబుల విచారించుట యావశ్యకము.

## సాంఖ్యయోగము.

వాస్తవముచే నియ్యధ్యాయము «తమువాచహృషీకేశః ప్రహసన్నివ భారత। సేనయో రుభయోర్మధ్యే విషీదంతమిదంవచః» అనుపదియవశ్లోకమునుండి ప్రారంభమగుచున్నది. ఏలయనఁ దొమ్మిదవశ్లోకాంతమువఱకు నర్జునునియొక్క సామర్థ్యార్థిత్వంబులను బ్రతిపాదించుటఁజేసి యీయధ్యాయమునందలి మొదటితొమ్మిదిశ్లోకము లర్జునవిషాదయోగమునందే సమన్వయమగుచున్నవి. ఇంకసాంఖ్య యోగమును

పేరఁబరఁగు శ్రీకృష్ణోపదేశమగు జ్ఞానము పదునొకండవశ్లోకం బుచే నారంభమగుచున్నది.

## ఉపదేశసాంప్రదాయము.

వెజ్జుకడకు రోగిసనునపు డట్టిరోగియొక్క రోగమునకుఁ దగునౌషధమును వెజ్జుప్రయోగించుట యుక్తమేకద. వాత రోగముగలవానికి సన్నిపాతపు మందును సన్నిపాతముగల వానికి వాతరోగపుమందు నీయఁడుగదా. జ్వరతత్త్వమునురోగి, తత్త్వమును విచారించి వెజ్జు, ఔషధప్రయోగము చేయునట్లు. సద్గురుం డధికారి సామర్థ్యమును, అధికారితత్త్వమును బరిశీలించి యుక్తమగు మార్గము నుపదేశించుఁగాని పిసుగునకును బియ్యమునకును నొకేమంత్రమన్నట్లు పండితునకును బామరునకును నొకేవిధముగనుపదేశముఁజేయఁబూనునా?అట్లుచేసిన నయ్యదినిష్ఫలంబగుననిగుర్తెఱుంగఁడా? శ్రీకృష్ణభగవాములు సర్వజ్ఞులుగావున నర్జునుని యొక్కతత్త్వ సామర్థ్యంబులఁగని పెట్టి యుక్తమును నుత్కృష్టతమంబునగు సాంఖ్యయోగమునుపదేశించె. 1 సకలసంసారధర్మాసంసంగంబైన సచ్చిదానంద స్వరూపంబగు నాత్మయందు స్థూలసూక్ష్మకారణంబు లను నుపాధిత్రయంబులయవివేకంబుచే

మిథ్యాభూతంబైన సంసారము సత్యమని సర్వప్రాణిసాధారణం
బైన భ్రాంతిని జెందుట. 2 స్వధర్మమైన యుద్ధమునందు హింం
సాబాహుళ్యముచే నధర్మభ్రాంతినిబొందుట, యనుద్వివిధరూ
పంబగు నజ్ఞానంబుచే నావరింపఁబడియున్న వానిఁగా నర్జునుని
ఱిఁగి యట్టిద్వివిధంబులగు భ్రాంతులనుదొలఁగింపఁబ్రథమంబునఁ
బదునొకండవ శ్లోకము మొదలు ముప్పదియవశ్లోకమువఱకు నా
త్మతత్వమును, ముప్పది యేడవశ్లోకమువఱకును స్వధర్మత్యాగ
మువలనిదోషములను దెలిపి 38 వ శ్లోకముచే నట్టిస్వస్వరూప
జ్ఞానమును గుర్తెఱుంగుటకు సాధనభూతంబగు నియతధర్మాచ
రణక్రమంబును సంక్షేపంబుగనుపదేశించిరి. ఇయ్యది శ్రీకృష్ణో
పదిష్టజ్ఞానసరణి. దీనినివిపులముగఁ గొంతవఱకు విచారింతము.

## భగవద్గీతాతత్వము.

తత్వవిదులు సదసత్తుల స్వభావమును గూర్చి ముచ్చ
టించిసిద్ధాంతమిట్లు చేసిరని శ్రీకృష్ణు లిట్లు పల్కుచున్నారు.

" నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః॥
ఉభయోరపి దృష్టోన్త స్త్వనయో స్తత్వదర్శిభిః,,

తత్వదర్శులనఁగా బ్రహ్మముయొక్కయథార్థమును
గుర్తెఱింగెడుస్వభావముగలవారు. తత్వదర్శినః॥ తత్వంబ్రహ్మ
ణోయాథాత్మ్యం తత్ ద్రష్టుంశీలం యేషాం తే తత్వదర్శినః॥

తత్త్వం॥ తదితిసర్వనామసర్వంచ బ్రహ్మతస్య నామతదితి। త ద్భావస్తత్త్వం॥

ఈశ్లోకమునందు సదసత్తులయొక్క స్వభావమువర్ణింపఁబడియున్నది. కావున నీశ్లోకము వేదాంతశాస్త్రమునకంతకును శిరస్సువంటిది. గీతాశాస్త్రమునందలి శ్లోకముల నన్నింటి నీశ్లోకముతో సంబంధముగనుఁ గొనిముచ్చటించినచో యథార్థమగు నర్థము దెలియు నవకాశము గల్గు. లేకుండినచో శాస్త్రమునకంతకు నపార్థమును గల్పించినవారలమగుదుము. సదసత్తులను నామంబులుమతములన్నిటిలోఁ బ్రయోగమును గనుచున్నను, అభిప్రాయంబులందు భేదమునుగల్గి యున్నవి. కావునఁ ద్రిమతములవారీశ్లోకమున కెట్లువ్యాఖ్యానముచేసిరో యొకింతవిమర్శింతము.

ద్వైతమత స్థాపకు లగు మధ్వారాయ లనునామంబుచేఁబరఁగు శ్రీమదానంద తీర్థులవారు తమగీతాభాష్యమున నీశ్లోకమున కిట్లు వ్యాఖ్యానముంజేసిరి.

“ అసతః కారణస్యసతో బ్రహ్మణశ్చాభావోనవిద్యతే,, నిత్యాత్మేత్యుక్తం ,, ఇట్టియర్థమును బ్రతిపాదించుటకు వీర లువిష్ణుపురాణవాక్యమగు “ప్రకృతిః పురుషశ్చైవ నిత్యౌకాలశ్చసత్తమేతి ,, యనుదానిని “ అసతః కారణత్వంచసదసద్ర్ఘా

పలూచా సౌగుణ మయ్యాగుణోవిభుః ,, అను భాగవత వాక్య మును «అసతఃసదజాయత ,, యనుశ్రుతిని బ్రమాణంబులు గానిచ్చియున్నారు. విశిష్టాద్వైత గురుండగు రామానుజాచార్యులవారిట్లు వ్యాఖ్యానమును జేసియున్నారు.

« అసతో దేహస్య సద్భావోనవిద్యతే। సతశ్చాత్మనో నాసద్భావః। *** దేహస్యాచిద్వస్తునో౽సత్త్వమేవ స్వరూపం ఆత్మనశ్చేతనస్య సత్త్వమేవస్వరూపమితి నిర్ణయోదృష్ట ఇత్యర్థః

అసత్త్వం-వినాశస్వభావోహ్యసత్త్వం॥
సత్త్వం-అవినాశస్వభావ శ్చసత్త్వం ॥

అద్వైత గురుండగు శంకరభగవత్పాదాచార్యు లిట్లు వ్యాఖ్యానముఁజేసియున్నారు.

అసతః అవిద్యమానస్యశీతోష్ణాదేస్సకారణస్యనవిద్యతే నాస్తి భావోభవనమస్తితా ॥ * * * * * *

సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధే స్సద్బుద్ధిరసద్బుద్ధిశ్చేతి। య ద్విషయా బుద్ధిర్నవ్యభిచరతితత్సత్ । యద్విషయా వ్యభిచరతి తదసత్ ॥ ఇతిసదసద్విభాగే బుద్ధితంత్రేస్థితే సర్వత్రద్వేబుద్ధీస ర్వైరుపలభ్యతే।* * * * * తస్మాద్దేహాదేర్ద్వంద్వస్యచ సకారణస్యా సతోనవిద్యతేభావః తథాసతఆత్మనః అభావఃఅవిద్య

మానతానవిద్యతే * * * *

ఏవమాత్మా నాత్మనోస్సదసతోరుభయోరపివృష్ట ఉపలబ్ధాం తో నిర్ణయః సత్ సదేవ-అసదస దేవేతి ,,

ఈగీతాశాస్త్రము నందెక్కుడు ఘనముగా నెన్నఁబడునీ శ్లోకమునకు ముప్వురు మతకర్తలును వారివారిమతముల ననుసరించి యర్థమునుబ్రతిపాదించిరి. ఈమూఁడర్థములంజేకొనియిందులోనెయ్యదియుక్తియుక్తముగను, ప్రకరణసందర్భముగనున్నదోయొకింత విచారించి నిజమును గనిపెట్టుదము. ఈ శ్లోకముయొక్క సామాన్యార్థముచే సదసత్తులని రెండుపదార్థములు దెలియవచ్చుచున్నవి. వ్యాఖ్యానకారులీ సదసత్పదార్థములను నిరూపించుటయందు భిన్నాభిప్రాయమును గల్గియునారు. అదెట్లులనిన.

| | సత్ | అసత్ |
|---|---|---|
| మధ్వారాయులు | బ్రహ్మ | కారణము |
| రామానుజులు | ఆత్మ | దేహము |
| శంకరులు | ఆత్మ | అవిద్యమానము |

ఇట్లునిరూపించి సదసత్తులయొక్క స్వభావముల నిట్లు నిర్వచించియున్నారు.

| | సత్ | అసత్ |
|---|---|---|
| మధ్వరాయలు | భావముకలది | భావముకలది |
| రామానుజులు | భావముకలది | సభావము తెలియఁబడనిది |
| శంకరులు | భావముకలది | భావము తెలియఁబడనిది |

మధ్వరాయలు తమభాష్యంబులకు సహజంబగుసంశయార్థ మునుడివిరి. ఏలయన « నాసతోవిద్యతే భావోనాభావోవిద్యతేసతః ,, యనువాక్యముచే సదసత్తులను రెండువిరుద్ధపదార్థములును వానియొక్క స్వభావమును స్పష్టముగుచుండ నా రెంటికిని గార్యకారణభావముంగల్పించిరి. ఇట్టీపాదముచే రెండు పదార్థములయొక్క నిర్ణయము చేయఁబడుచున్నదని « ఉభయోరపి దృష్టోన్త స్త్వనయోస్తత్త్వదర్శిభిః॥ ,, యను రెండవ పాదము కంఠోక్తిగఁ బల్కుచున్నయది. శంకర రామానుజులిరువురును పదార్థద్వయపరముగానే భాష్యములఁజేసిరి. కాని వారలీ పదార్థద్వయమునకును గార్యకారణభావమును దెలుపుడు సేయలేదు. ఈశ్లోకము వాస్తవముచే బదార్థనిర్ణయమును జేయుటకై ప్రవర్తించినది. అట్లుప్రవర్తించుటయుఁ బూర్వాపరసందర్భముగనున్నయది. అదెట్లన జిజ్ఞాసువులు బ్రహ్మపదార్థమును దెలియఁగోరి యట్టిపదార్థాన్వేషణమునకై పలువిధంబులఁ బ్రయత్నంబులు చేయుచుఁ దమకు వేద్యమగుప

దార్థములనన్నింటిని విమర్శింపఁజొచ్చి వారివారి యధికారా నుగుణంబుగఁబదార్థవిభజనంబుగావించిరి. అట్లుచేయుటయం దు న్యాయశాస్త్రజ్ఞులు షోడశపదార్థములుగను వైశేషికులే డుపదార్థములుగను విభాగమొనరించిరి. సాంఖ్యులన్నను పురుషప్రకృతి విభాగంబుసేసిరి. ఆతీరుననే వేదాంతులుసదసద్వి భాగంబుఁజేసిరి. అయిన నిట్టి పదార్థవిభాగమునందు భి న్నాభిప్రాయములుండినను వేదాంతమునందుసదసత్తులని రెం డుపదార్థములువ్యవహరింపఁబడి వానియొక్కతత్త్వమునిశ్చ యింపఁబడుచున్నది. ఇంతేకాకుండ వేదాంతమున కాలవా లమును నిశ్చయతత్త్వ ప్రతిపాదకంబునగు నీశ్లోకమునింత నిరసనంబుగఁ ద్రోసివేయుటచే మధ్వరాయలు పొరబడినట్లు తోఁచుచున్నయది.

ఇంకమతకర్తలచే « నాసతో విద్యతేభావో, నాభావో విద్యతేసతః,, యనువాక్యమునకుఁ బ్రతిపాదింపఁబడిన యర్థ ముఁ గొంతవఱకు విమర్శింతము. ఈవాక్యమునకు మతకర్త లచేఁజేయఁబడిన పదచ్ఛేదము.

మధ్వరాయలు—న + అసతః + విద్యతే + అభావః। న + అభావః + విద్యతే + సతః॥

రామానుజులు—న + అసతః + విద్యతే + భావః। న + అభావః + విద్యతే + సత॥

శంకరులు—న+అసతః+విద్యతే+భావః। న+అభావః+విద్యతే +సతః॥

ఇందుమధ్వరాయలవారి పదచ్ఛేదముశంకర రామానుజుల పదచ్ఛేదమునుంచి పూర్ణముగా భేదించియున్నది. కావున ముందుగ వీరిచేఁ బ్రతిపాదింపఁబడిన యర్థమునువిచారింతము. వీరిశ్లోకపదచ్ఛేదము « న+అసతః+విద్యతే+అభావః। న+అభావః+విద్యతే+సతః॥ ఇట్లుపదచ్ఛేదమును జేయకపోయినట్టయిన «అసతఃకారణస్యసతో బ్రహ్మణశ్చాభావో నవిద్యతే,, యని యర్థముఁజెప్పుటకవకాశమెంతమాత్రమును లేదు. అనఁగా వీరసత్తునకువసత్తునకుఁ గూడనభావము తెలియఁబడదని చెప్పిరి. అట్లుచెప్పుటలో « అసతః,, అనుపదమునకు « కారణస్య,, అనియర్థమును బ్రతిపాదించిరి. దానంజేసి వాక్యార్థమిట్లువ్యక్తమగుచున్నది.

కారణమునకునుబ్రహ్మమునకునుఅభావము తెలియఁబడదు.

ఇచ్చట « కారణస్య ,, అనుశబ్దముచే స్ఫురించుకారణము దేని విషయమో స్పష్టీకరింపఁబడలేదు. కాని « అసతః,, అనుశబ్దమునకు « కారణస్య ,, అనునర్థమును బ్రతిపాదించుటలోఁగొన్ని శ్రుతిస్మృతివాక్యములనుడివిరి. అట్టివాక్యములనుం

దిస్పష్టమగు నదర్థమును గొంతవిచారింతము. వీరు « అసతః సదజాయత „ యనుశ్రుతిని బ్రమాణముగా స్వీకరించిరి. ఈ శ్రుతికి « అసత్తువలనసత్తుపుట్టె„ నని యర్థము. దానంజేసి సత్తునకసత్తుకారణమని స్పష్టమగుచున్నది. ఇచ్చటవీరిచ్చిన యర్థము చేశు శ్రుత్యర్థమును బరిశీలించినచోఁ గలుగుదోషమ్యము « సతః „ అనుచో « బ్రహ్మణః „ అని యర్థమః జెప్పిరికదా « అసతఃసదజాయత „ అనుచో, అసత్తువలన బ్రహ్మముపుట్టెనని తేటయగుచున్నది. దానంజేసిబ్రహ్మముకార్యము అసత్తుకారణము. కావున « యత్కృతకంతదనిత్యం „ «యజ్జన్యంతన్నశ్యం„ «అనున్యాయంబుల చేబ్రహ్మమునకునాశప్రసంగముగల్గుచున్నయది.అనబ్రహ్మమునకనిత్యత్వాభావప్రసంగంబులుసంప్రాప్తమగుచున్నవి.దానంజేసిఃబ్రహ్మణశ్చాభావోనవిద్యతే „ యనునర్థమసందర్భమగుటచే హాస్యాస్పదమగుచున్నది. దానంజేసిశ్రుత్యనుగుణంబుగ « అసతః „ అను పదమునకుఁ గారణత్వపరముగా నర్థముఁజేసినచో « నాసతో విద్యతే+అభావః „ అనుపదచ్ఛేదానుగుణంబగు నర్థము సరియైనచో « నాభావోవిద్యతేసతః „ అనువాక్యముసమంజసమగుచున్నది. కావున నిచ్చట « అసతః „ అనువప్పుడు «కారణస్య „ అనియర్థముఁజెప్పినచో «నాభావోవిద్యతేసతః„

అను వాక్యమును “నభావో విద్యతేసతః” అనుదానిగా మార్చి “సతః పదముచేఁ బ్రతిపాదింపఁబడిన బ్రహ్మమునకు నభావముఁ జెప్పినచో బాగుండును గాని మూలచ్ఛేద దోషభీతిచే నంతపనిఁ జేయ మధ్వరాయలు సాహసించలేకపోయిరి. గాని యథార్థము వ్యక్తముగాకుండునను తలంపుచేఁ బదచ్ఛేదమును మాత్రము మరలించి యపార్థమును గల్పించిరి. ఇది యసంగతము. పోనిండు. “అసతః” అనునప్పుడు “కారణస్య” అని చెప్పుటలో జగత్కారణమగు ప్రకృతిపరమని యొకవేళఁ జెప్పఁబూనుదురేమో. అట్లు చెప్పుట ప్రకరణసందర్భమును బట్టి యసంగతము. ఏలయన నర్జునునకుఁ గల శోకసందేహంబులు దేహాత్మభ్రాంతిం జేసి కాని జగత్కారణంబునకు నభావము తెలియఁబడుచున్నదా? భావము తెలియఁబడుచున్నదా? యని కాని యూతిరుననే బ్రహ్మమునకు భావమా యభావమా యని కూడఁగాదు. కావున నీశ్లోక వ్యాఖ్యానమునందు మధ్వరాయలువారు వ్రాసిన యవతారికగూడ నసంగతము. “నిత్యా ఆత్మేత్యుక్తః కిమాత్మైవ నిత్య ఆహోస్విదన్యదపి। అన్యదపి। తత్కిమిత్యత ఆహ। నాసత ఇతి,” ఇట్టి శంక యర్జునునకుఁ గల్గుటచే విషాదముఁ జెందెనని యూహించుటయు నట్టి యూహాననుసరించి శ్రీకృష్ణభగవానుఁడీ శ్లోకముఁ జెప్పినారని

మూలచ్ఛేద రూపమగు వ్యాఖ్యానము జెప్పుటచేత నమధ్వ రాయల మతము నిరసింపఁబడుచున్నది. ఇంకను వీరలీశ్లోకార్థమును వ్రాయుటలోఁ గొన్ని శ్లోకంబులఁ బ్రమాణంబులుగ నిచ్చి యాశ్లోకముల నుండి “అసతః కారణస్య అభావః నాస్తి” అని యర్థమును బ్రతిపాదించిరి. కాని యాశ్లోకములకు నిచట నెంత మాత్రమును బొందిక లేదు. ఇంక నీశ్లోకమునందు మధ్వరాయలవారి మతతత్త్వమును బట్టి “సతః” అను పదమునకుఁ జెప్పఁబడిన యర్థము గూడఁ దప్పుగా భావింపఁబడవచ్చు. “సతః” అనఁగా “బ్రహ్మణః” అని యర్థమీయఁబడెను. ప్రస్తుతపుఁ బ్రకరణమునందు, అనఁగా శ్రీకృష్ణులవారిచే నుపదేశింపఁబడిన “అశోచ్యా నన్వశోచస్త్వం” అను శ్లోకము మొదలు “దేహీనిత్యమవధ్యోయం దేహేసర్వస్య భారత” యను శ్లోకము వఱకుఁ గల శ్లోకములన్నియును దేహీ దేహస్వభావమును ముచ్చటించుచుండ బ్రహ్మమునుగాని జీవబ్రహ్మముల సంబంధమునుగాని జగత్కారణమునుగాని ముచ్చటించుచున్నవని చెప్పుట కొక్క జీవేశ్వరాభేదమును బ్రతిపాదించు నద్వైతులకుఁ దక్క వేఱొకరికి నవకాశముగలదె? దేహినే బ్రహ్మముగా నంగీకరించినచో “సతః” అన “బ్రహ్మణః” అని యుచ్చరించినఁ దప్పిదము లేదు. అట్లంగీకరించుట మధ్వరాయల కెంతమాత్రము

ను రుచింపదుకదా! ఇట్లిరువది శ్లోకములు కంఠోక్తిగ దేహి యొక్క తత్త్వమును నిరూపించుటకు నుపదేశింపఁబడినప్పు డందొక « నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః „ అ నుశ్లోకము మాత్రము జగత్కారణపరము బ్రహ్మపరమునై యుండునని యూహించుట యెంతమాత్రమును సమంజసము గాదోఁపదు. ఇంక సత్, అసత్„ అనుపదములు రూఢ్యర్థపర ములుగాక ప్రకరణసందర్భమునుబట్టి « సత్,అనుపదముచే నా త్మ యనఁగా దేహిని స్వీకరింపవలయును. ఇట్లుశంకర రా మానుజులిరువురును సత్పదముచే దేహియైన యాత్మనుస్వీకరిం చిరి. జీవేశ్వరుల కభేదమంగీకరించినచో « సతః „ అనుదానికి యీసందర్భమున « బ్రహ్మణః „ అని యర్థముఁజెప్పినఁ జెప్పవ చ్చు. అట్లుచెప్పినచో జీవేశ్వరభేదము నంగీకరించిన మధ్వ రాయలవారికిస్వమత వ్యాఘాతంబుగాదె! ఇందువిషయమె ద్దియన నాత్మతత్త్వము, శరీరతత్త్వము. కావున పట్టిసందర్భ మునకుయుక్తముగునట్టియు, వారివారిమతములకు యోగ్యము లైనట్టియు ముఖ్యార్థములను ధర్మపరంబులగుసత్ అసత్ అ నుపదములకు శంకరరామానుజులు ప్రతిపాదించిరి.

ఇంక రామానుజాచార్యులవారిచేఁబ్రదర్శింపఁబడినయ ర్థమునుగొంత విచారింతము. శ్లోకపదచ్ఛేదమునందును

«సత్» శబ్దార్థమునందైనను శంకరరామానుజులకెంతమాత్రము భేదము గానంబడదు. అందులకు వారి వ్యాఖ్యానంబులె పరమప్రమాణంబులు.

రామానుజులు.—అసతో దేహస్య సద్భావోనవిద్యతే సతశ్చా
త్మనో నాసద్భావః॥

శంకరులు.—అసతః అవిద్యమానస్య శీతోష్ణాదేస్సకారణస్యన
విద్యతేనాస్తి భావోభవనమస్తితా * * * సత
ఆత్మనః అభావః అవిద్యమానతా వవిద్యతే॥

వీరిరువురకును గల భేదమెందన శబ్దములచే బ్రతిపాదింపంబడునభిప్రాయములందు «అసతః» అనుపదముచే దేహమని యర్థము చెప్పుటచే నంతగా భేదము గాన్పించదు. ఇంకను «అసతః» అనుపదముచే దెలియం జెప్పంబడు దానికి భావము తెలియంబడదనుటలో నిరువురకునంగీకారమే వీరియుద్దేశంబుల నిట్లు నిరూపింపనగును.

| | సత్ | అసత్ |
|---|---|---|
| రామానుజులు— | ఆత్మ | దేహము |
| శంకరులు— | ఆత్మ | అవిద్యమానము |
| రామానుజులు— | అభావము తెలియంబడనిది | భావము తెలియంబడనిది. |
| శంకరులు— | అభావము తెలియంబడనిది. | భావము తెలియంబడనిది. |

వీరలిరువురును శ్లోకమునకుఁ బదచ్ఛేదమునొకేరీతిని జేసిన ట్లువిస్పష్టమగుచున్నది. అదెట్లనిన. న+అసతః+విద్యతే+భావః న+అభావః+విద్యతే+సతః॥ మధ్వరాయలుగూడసత్తునకభావ ము దెలియఁబడదను విషయమున శంకరరామానుజులతో నే కీభవించుచున్నారు. దీనింబట్టి మనము తెలిసికొనఁదగువిషయ మెద్దియన సదసత్తులచే నేపదార్థములు ప్రతిపాదింపఁబడినను సరే సత్పదార్థమభావము తెలియఁబడ్డనిదియు, అసత్పదార్థ ము భావము తెలియఁబడనిదియు నని. ఇట్టి యభిప్రాయంబునం దుభయు లేకీభవించుటచే నయ్యది బలవత్తర మగుచున్నది.

ఇంక రామానుజుల వ్యాఖ్యానముంగూర్చి కొంతవిచారించి చూతము « అసతో దేహస్య సద్భావోనవిద్యతే ,, వీరు «అస తః ,, అనుపదముచే దేహమును స్వీకరించిరి. అట్లుస్వీకరించు టప్రకరణ సందర్భమునుబట్టి సమంజసముగా నున్నటుల దోఁ చుచున్నను, సందేహాస్పదముగనున్నయది. « అసతః ,, అనుప దముచే రామానుజులు నిరూపించినట్లు « దేహమే ,, నిరూపిం పఁబడవలసివచ్చినచో నీశ్లోకము «దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారంయౌవనంజరా ,, యనుII.13 శ్లోకము తరువాత శ్రీ కృష్ణభగవానులుచ్చరించి యుండవలయును. ఈశ్లోకమున్ననో మఱి రెండుశ్లోకములచేఁగొంతయభిప్రాయమును వెల్లడిచేసినత

రువాత నుచ్చరించుటంజేసి యట్టిశ్లోకాంతర్గతంబగు నభిప్రాయంబుతో సంబంధముగలిగియున్నట్లు తప్పకస్ఫురింపకమాన దు. అట్టిరెండుశ్లోకములును « మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః » « యంహినవ్యధయన్త్యేతే పురుషం పురుషర్షభ » యనునవి. ఒకవేళ రామానుజులు ప్రతిపాదించిన దేహశబ్దముచే శీతోష్ణాదిద్వంద్వములకు నుత్పత్తిస్థానము; అనఁ గారణభూతంబైన సూక్ష్మశరీరమునే గ్రహింపవలయునందురేని శంకరులు ప్రతిపాదించిన యర్థమునం దిసుమంతయు భేదింపక నేకీభవింపవలసివచ్చును. ఇంకనభిప్రాయ భేదంబును గూర్చి కొంతవిచారింతము. వీరలు శ్లోకవ్యాఖ్యానమున « అసతో దేహస్యసద్భావో నవిద్యతే, సతశ్చాత్మనో నాసద్భావః » అనిచెప్పుటలో « భావః » అనిన « సద్భావ » మనియును « అభావః » అనిన « అసద్భావ » మనియును వ్రాసిరి. పిమ్మటఁగొంతవఱకు నీయర్థవివరణముంజేయుచు నడుమ « దేహస్యాచిద్వస్తునోఽసత్త్వమేవరూపం ఆత్మనశ్చేతనస్య సత్త్వమేవరూపమితి నిర్ణయోదృష్టఇత్యర్థః » అనివ్రాసియున్నారు.

సద్భావమనిన సత్తుయొక్క స్వభావమనియు, అసద్భావమనిననసత్తుయొక్క స్వభావమనియు నర్థము దీనిచే దెలియవచ్చునది యేమి, అసత్తుయొక్క స్వభావము దెలియఁబడ

నిది సత్. సత్తుయొక్క స్వభావము దెలియఁబడనిదిఅసత్ అని కదా. ఇట్లు చెప్పుట నీరీతిగానున్నయది. సత్తనసేమి అసత్తుగాదు. అసత్తనసేమి సత్తుగాదు. ఇట్టియర్థమునే శ్లోకముప్రతిపాదించినచో సదసత్తులేవియో గుర్తెఱుంగుట యెట్లో రామానుజులే ప్రత్యుత్తరమీయవలసియున్నది. ఇట్టియర్థముచే నీశ్లోకమునందు సదసత్తులయొక్క స్వభావంబుప్రతిపాదింపఁబడనట్లుస్పష్టమగుచున్నది. శ్లోకముయొక్క రెండవచరణమున " ఉభయోరపిదృష్టోన్త స్త్వన యోస్తత్త్వదర్శిభిః॥ దత్త్వదర్శులచే నీరెంటియొక్క నిర్ణయము చేయఁబడెనని వెల్లడి చేయఁబడుచున్నదిఅసత్తన సత్తుగాదని చెప్పుటకుఁదత్త్వదర్శులుగావలెనా?

ఇంకవీరలు దేహమునకసత్త్వము స్వరూపమనియు, ఆత్మకు సత్త్వముస్వరూపమనియు నుడివిరి. అనఁగాసత్తునకుసత్త్వము స్వరూపము. అసత్తునకసత్త్వము స్వరూపమని తేటయగుచున్నదికదా?సాధారణముగా నెద్దియేని యొకవస్తుధర్మమును బ్రతిపాదించుటలో నా వస్తునామమునకు " త్వం ,, ప్రత్యయమును జేర్చిచెప్పుట శాస్త్రీయసాంప్రదాయమేకద. అదెట్లనిన. గోవునందు గోత్వము, మనుష్యునందు మనుష్యత్వము, పృథివియందుఁబృథివీత్వము లోనుగాఁగలవి. ఆరీతినేసత్తుయొక్కధర్మముసత్త్వమనియు, అసత్తుయొక్క ధర్మమసత్త్వమని

యు నెల్లవారలును సామాన్యముగ నెఱింగిన విషయమేకద. అయిన నిందొక విశేషముగలదు. గోత్వ, మనుష్యత్వ, పృథివీత్వ, సత్త్వాసత్త్వాదులు గుణములుఅనఁగా ధర్మములనియును, గోవు, మనుష్యుఁడు, పృథివి, సత్తు, అసత్తు లోనుఁగాఁగలవి గుణులుఅనఁగా ధర్ములనియును జెప్పఁబడును. నయ్యాయకాదులీగుణగుణులకు ననఁగా ధర్మధర్ములకు భేధమును బ్రతిపాదించుచున్నారు. వేదాంతులన్ననో గుణగుణులకున భేదమునుబ్రకటనచేయుచున్నారు. ఇచ్చటసత్తునకుసత్త్వముస్వరూపము అసత్తున కసత్త్వము స్వరూపమని చెప్పుటచేఁ దామునయ్యాయకాదులకంటె గుణగుణి సంబంధమున భిన్నాభిప్రాయమును గలిగియున్నటులఁబ్రకటనచేయుటకుఁదక్క పరిష్కృతమున కెంతమాత్రము నుపచరించినట్లేరికిని దోఁచదు. ఈవాక్యముచేఁ దెలియు నంశమెద్ది:—సత్తున సత్త్వము. అసత్తున అసత్త్వము. ఇచ్చట సత్త్వమన నేమియభిప్రాయమో, అసత్త్వమన నేమియభిప్రాయమో రామానుజులే చెప్పవలసియున్నది. ఏమీ దేహమచిద్వస్తువనియుఁనాత్మచేతనమనియుఁ బైవాక్యమునఁ దెలియఁబడలేదా? సరే తెలియఁబడుచున్నది.

రామానుజవాక్యములసారాంశము నొక్కదరికిఁ జేర్చిచూతము

అసత్ — అచిద్వస్తువు - అసత్యస్వరూపము -- సద్భావము తెలి
యఁబడనిది.

సత్ — చేతనము - సత్యస్వరూపము - అసద్భావము తెలియఁ
బడనిది.

ఇంతియేకద. దీనివలన నీసదసత్తులకుఁగల తారతమ్యమును
గొంచెము నూపుము. ఈపదములన్నియు యుక్తమగు సభి
ప్రాయము ప్రతిపాదింపఁబడనిచో నిరర్థకములగును. ఏమీ
రామానుజులుసత్యాసత్యములన్న నేమి యోనిర్వచింపనట్లీపూ
ర్వపక్షంబులుచేయుచుంటిరే. సరే రామానుజ నిర్వచనంబును
దాచిమాటలాడఁదలంచ లేదు. అట్టినిర్వచనంబును దెచ్చినచో
నెక్కుడు ప్రమాదము వాటిల్లునేమోయను తలంపున నింత
వఱకు నూరకుంటిని. నీయిష్టముచొప్పునచూతము రా "వినాశ
స్వభావో హ్యసత్త్వం" అవినాశస్వ భావశ్చసత్త్వం" ఇవియే
కదా నిర్వచనంబులు. సరే వ్యాఖ్యాన వివరణవాక్యమునందీ
లక్షణంబులన్వయించి చూడుము.

దేహస్యాచిద్వస్తునో (సత్త్వమేవ) వినాశ స్వభావమేవ
రూపం॥ ఆత్మనశ్చేతనస్య (సత్త్వమేవ) అవినాశస్వభావమేవ
రూపం అనఁగా దేహమునకు వినాశస్వభావము రూపమనియు
నాత్మకు నవినాశస్వభావము రూపమనియునుగదా స్పష్టమగు

చున్నది. వినాశస్వభావము, అవినాశస్వభావము రూపంబు తె ల్లగుచున్న వ్వారామానుజులు సెప్పవలసియున్నది.

ఇక్కడకు స్పష్టమైన యర్థంబెద్దియన.

అసత్తు నశించుస్వభావముకలది సత్తు వినాశమునొందని స్వభావముకలదియనికదా.

దీనిచే భావాభావశబ్దంబులకు రామానుజులు చెప్పదలంచిన యర్థమిదియన్ని తేలుచున్నది.

భావః = అవినాశస్వభావము, అభావః = వినాశస్వభావము. చిట్టచివరకుఁ దేలిససారాంశమేమన దేహము వినాశస్వభావము గలదియనికదా. ఇట్టిస్వల్పమైన యర్థమును బ్రతిపాదించుటకు నింతక్లిష్టమగు పదంబులతోఁ గూడిన శ్లోకమునిచటఁ బ్రయోగించుటకుఁ గలప్రయోజనమెంతమాత్రమును గానరాదు. ఏలన « దేహినోస్మిన్ యథాదేహే ,, « అశోచ్యానన్వశోచస్త్వం ,, «అంతవంతఇమేదేహాః,, «వాసాంసి జీర్ణాని,, దేహీనిత్యమవధ్యోయం దేహేసర్వస్య భారత «ఇత్యాదిశ్లోకములచేఁ దటతెల్లముగ దేహమనిత్యమని తెలియవచ్చుచుండ « నాసతో విద్యతేభావో నాభావో విద్యతేసతః ,, అనుశ్లోకముచేఁగూడ నియ్యభిప్రాయమునే ప్రతిపాదించుటకు శ్రీకృష్ణభగవానులీ శ్లోకమునుచ్చరించిన నీశ్లోకప్రయోజనమునుగూర్చి కొంచెమువిచారింపవలసియుండును. దేహముయొ

శ్క వినాశస్వభావమును ఆత్మయొక్క యవినాశస్వభావము నేయీశ్లోకము ప్రతిపాదించునెడల "అసతః" "సతః" అనుపద ములయొక్క యర్థమును దెలియఁజెప్పుటకై యుపయోగిం పఁబడిన నైఘంటిక వాక్యమాత్రముగావలసివచ్చును. అట్లై నచో నర్థరాహిత్యములును పునరుక్తి దోషయుక్తంబులున గు పదంబులతో నొప్పు శ్లోకగౌరవమెగాని వేఱొండు ప్రయోజనమెంతమాత్రమును గానరాదు. వీరిభాష్యముచే భగవానులగు శ్రీకృష్ణవాక్యమునకుఁగూడ నిష్ప్రయోజన దోషంబు గల్గుచున్నయదికదా! ఏమివింత పరాత్పరునందు వీరికిఁ గల్గుభక్తిప్రపత్తులు?

ఇంక అసత్తునకు సద్భావము లేదనివీరిభాష్యము చెప్పుచున్నది. అదియెట్లనిన "భావః" అనుపదమునకుసద్భావమని యర్థమును వ్రాసిరి. సత్తునందు సద్భావము, అసత్తునందసద్భావముండు నని యెల్లరు నెఱింగినవిషయమును సర్వమతసిద్ధాంతమునైయున్నయది. మఱియు సదసత్తులు కేవలవిరుద్ధ ధర్మములుగలవియనియు నెల్లరు నెఱింగినయంశమే. అట్టివిషయంబునందసత్తునకు సద్భావము తెలియఁబడదని చెప్పుటయొకమహదంశముగాదు. ఇంతియె కాకుండ నసత్తునొక్కయు సత్తుయొక్కయుయథార్థమును దెలియఁజెప్పనీశ్లోకమునకు సత్తుపమి? అసత్తుగాదు. అసత్తేమి? సత్తుగాదని చెప్పిన నెంతసొగసుగనుండు వ్యాయామీతినె వీరివ్యాఖ్యానముప్రకాశించుచున్నది.

ఆహా! యేమివ్యాఖ్యాన కౌశలము! వీరివ్యాఖ్యానమును బట్టి కు « టీకాటీకామపేక్షతే » యనునట్లుపవ్యాఖ్యానమొకటి కూడఁగావలయును. భావమను చోసద్భావమనుటకు మాఱుగ నవినాశస్వభావమనియు, అభావమనుచో నసద్భావమనుటకుమాఱుగవినాశస్వభావమనియుఁ బ్రథమముననెవ్రాయఁ గూడదా? అట్లువ్రాసినచోఁ దమవ్యాఖ్యాన కౌశలము సుకరంబుగ వెల్లడియై తమమతమునకు భంగముగల్గునని రామానుజులు పూర్ణముగా నెఱింగియున్నటుల నీక్లిష్టకల్పనముపలన లెస్సగనూహింపవచ్చు.

అసత్తునకు భావముతెలియఁబడదు. సత్తునకభావము తెలియఁబడదు. అన నసత్తునకు భావములేదు. సత్తునకుభావముకలదు. భావమనఁగానున్కి-అస్తిత. అభావమనఁగా లేమి. అనఁగా నాస్తిత్వము. అనితేటయగునర్థము నిచ్చుపదంబులచే పదసత్తులయొక్క నిశ్చయము నీశ్లోకమువుచ్చాటించుచుండ రామానుజులిట్టిక్లిష్టకల్పనఁజేయుటకడుసాహసమైనయసంగతము.

ఇంకశంకరుల వ్యాఖ్యానమును గూర్చి కొంచెమువిచారింతము. వీరలు « అసతః » అనునప్పుడు « అవిద్యమానస్య » యనియు «భావః » అన «భవనమ్ అస్తితా » యనియునర్థమునువ్రాసిరి. « అవిద్యమానస్య » అనుదానికి « శీతో

ష్ణాదేస్సకారణస్య,, యని వివరణమును వ్రాసిరి. దీనివలనఁ దెలి యువచ్చు నభిప్రాయమెట్టిదనిన « అసత్ ,, అను శబ్దముచే వీర లుశీతోష్ణాది ద్వంద్వములకుఁ గారణభూతమైన మాత్రాస్పర్శ లను అనఁగా సూక్ష్మదేహమును స్వీకరించినట్లును, అట్టిదియవి ద్యమానము నగుటవలన నద్దానికి « నాసతో విద్యతేభావః ,, అనున్యాయంబుననున్కి లేదనియుఁ జెప్పిరి. సూక్ష్మశరీరమును అనఁగా మాత్రాస్పర్శలన సచ్ఛబ్దముచే స్వీకరించుట ప్రకర ణసందర్భమును బట్టి యుక్తముగానున్నయది. ఏలయన నీశ్లో కము « మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః। ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వభారత॥,, II.14« యం హిననవ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ। సమదుఃఖసుఖంధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ II. 15. యను రెండు శ్లోకముల కుఁ బిమ్మట నుపదేశింపఁబడియున్నది. ఈ రెండుశ్లోకముల యభిప్రాయం బెట్టిదనిన:—

శ్రోత్రాదీంద్రియములయొక్క శబ్దాది విషయ సంయోగములన్నవి యొకానొకప్పుడు శీతమును నొకానొకప్పుడు ష్ణమును, అతీవుననే యొకప్పుడు దుఃఖమును మఱియొక ప్పుడు సుఖమును గలుగఁజేయును. కావున సంయోగవియోగ ములుగలవి కావున నస్థిరములన నశ్వరములు. కావున నట్టిద్వం

ద్వములనోర్చుకొనుము. ఈయింద్రియవ్యాపారములు, సుఖదుఃఖాదిద్వంద్వములయందు సమబుద్ధిగల్గిన ధీమంతుఁడైన యే పురుషుని బాధింపవో వాఁడు మోక్షమునకు అర్హుఁడగుచున్నాఁడు.

అయినశీతోష్ణాదులకుఁ గారణభూతంబులైనదేహాదులవిద్యమానములని చెప్పఁబడినవి వానికినునికి లేదని చెప్పఁబడినది. ఇదియెట్లుసమంజసమగుననఁ దేహాదులునశ్వరంబులనిన దెలియఁబడుచున్నదికదా. అయిననీదేహంబులెల్లప్పుడును దెలియఁబడుచున్నవా? స్వప్నావస్థయందుస్థూలశరీరమవిద్యమానము. సుషుప్తియందు స్థూలసూక్ష్మంబు లవిద్యమానంబులు. అతీరుననే పారమార్థికంబునఁగూడనీశరీరంబు లవిద్యమానంబులు; కావున భావము తెలియఁబడనివియని యెఱుంగునది.

ఈశ్లోకమిచ్చట నుచ్చరింపఁబడుటకుఁగలయభిప్రాయం బెద్దియన, వినాశస్వభావమును గల్గియున్నటులఁ దోఁచువస్తువులసత్త్వనిలోకులచే వాడఁబడుచున్నదికదా! అట్లు (వినాశ స్వభావముగల) లోకమునందుఁ దెలిసికొనఁబడు వస్తుజాలమునకు నునికి యొంతమాత్రమును లేదని ప్రకటించుటకీశ్లోకము ప్రవర్తించినది. అసత్తునకు భావము లేదనినచో నేటయగు నర్థ మెద్దియన సనత్తైన స్థూలాదిదేహాదులకు భావ

ము అనఁగానునికి లేదని. ఈ దేహాదులకు భావము లేకపోయిన చో నెట్లు తెలియఁబడుచున్నవన నీదేహములు భ్రిమజన్యము లుగాని వాస్తవముచే పీటికినున్కి లేదు. ఇట్లు దేహాదులు భ్రి మజన్యమని మధ్వరాయలుగూడఁ గొంతవఱకు వెల్లడిచేసి యున్నారు. 15 వ శ్లోకభాష్యంబున « అనిత్యా ఇతి। అతశ్చా త్మనో దేహాద్యాత్మభ్రిమఏవసుఖదుఃఖకారణం „ 20వశ్లోకభా ష్యమునందు « వ్యవహారస్తు భ్రాంతఇత్యాహ„ అనిచెప్పియు న్నారు. దేహములకు భావము లేదనినచో నవి భ్రిమజన్యము లని చెప్పఁబడినదికదా? అట్టిభ్రిమయన నెద్దియో కొంచెము వి చారింతము. భ్రాంతియనఁగా «అతస్మింస్తద్బుద్ధియని „ శం కరులువచించియున్నారు. అదియెట్లన శుక్తినిజూచి రజతమను కొనుట. రజ్జునుజూచిసర్పమనుకొనుట మరీచికలఁజూచి జలమ నుకొనుట. ఇట్టి భ్రాంతికి భావముండదని యెల్లవారలకును దెలిసినయంశమే. ఇట్టిభ్రాంతి నేయసద్బుద్ధియందురు. అసద్బు ద్ధియే యసత్పదముచేఁబ్రితిపాదింపఁబడుచున్నటుల శంకరులు వ్రాసిరి. ఇట్టియర్థము సమంజసమైయున్నయది. ఎట్లనఁగా లోకమునందుఁదనాశస్వభావముఁగల్గియున్నట్లుగాఁదోఁచు దేహాము లు భ్రాంతివిషయములుగాని వాస్తవములుగావని ప్రితిపాదిం చుటకై « నాసతోవిద్యతేభావోనాభావోవిద్యతేసతః„ అను

శ్లోకము ప్రవర్తించినదనుట యుక్తాయుక్తముగను సమంజసముగను సందర్భానుసారముగ నున్నయది. ఇంతియేకాక శ్రుతిసమ్మతముగ నున్నయది. కావున శంకరభగవత్పాదులవారిచే బ్రదర్శింపఁబడిన యభిప్రాయము స్థిరతగనుచున్నయది.

ఇంతవఱకు మధ్వరామానుజ శంకరప్రోక్తంబులగు నర్థంబులఁగూర్చి ముచ్చటించితిమి. అద్దానివలన మనము ప్రయోజనమును బడయుటయెట్లు? మతకర్తలు మువ్వురును భేదము బొందియుండిరేయన నీమూఁడింటివలనఁగలుగు సారాంశమును దీసి మూలగ్రంథతాత్పర్యముతో సంబంధింపఁజేసిప్రయోజనము గనుటకుఁ బ్రయత్నించుదము.

మూఁడువ్యాఖ్యానములను జూడ సత్, అసత్తు అను పదములు రూఢియైన యర్థమునఁగాక స్వభావపరముగానుపయోగించినట్లుల విస్పష్టమగుచున్నది. ఈశ్లోకమున నసత్తను దానికి మధ్వరాయలు కారణమనియును రామానుజులు దేహమనియును శంకరులు శీతోష్ణాదిద్వంద్వములకుఁ గారణముగు నవిద్యమానమనియు నర్థములఁ బ్రతిపాదించిరి. అసత్తున కర్థ మీమూఁటియందెద్దియైనను నట్టిస్వభావముగల పదార్థ మసత్తుతరగతిలోఁ జేర్చవలయునను విషయమును మనమీశ్లోకమునుండి యూహింపవలసియున్నది. అటులనే సత్తునుగూర్చికూడ గుర్తెఱుంగవలసియున్నది.

ఇందుకుఁగల యాధారము అసత్తునకు భావములేదు అను “ నాసతో విద్యతేభావః ” అనువాక్యము.

ఈవాక్యమునుండి మనము తీసికొనవలసిన యనుమానమ్ము, దేనికి భావములేదో యది అసత్తు. అనఁగా దేనికిని భావము కలదో యది యసత్తు. అభావము ప్రాగభావప్రధ్వంసాభావాత్యంతాభావ అన్యోన్యాభావములని నాలుగు తెఱంగులు. ఇందెవ్విధంబైనయభావమొకవస్తువునుగూర్చి తెలియఁబడినప్పు డట్టివస్తువునకు భావములేదని నిశ్చయింపనగు అట్టి భావములేనిది భ్రిమజన్యమని శంకరు లభిప్రాయమును బొందియున్నారు. ఆహేతువుచే వీర లసత్తును నిర్ణయించుట కొకయుపాయమును జెప్పినారు. అదెద్దియన దేనివిషయమై బుద్ధి వ్యభిచరించునో యదియసత్తు. దేనివిషయమై బుద్ధి వ్యభిచరింపదో యది సత్ “ యద్విషయాబుద్ధిర్న వ్యభిచరతి తత్సత్ ” “ యద్విషయా వ్యభిచరతి తదసత్ ” అ ద్దెట్లు లనిన మనమొక వృక్షమును జూచుచున్నాము. ఈవృక్షమునుగొట్టి ముక్కలుగాఁ గొట్టినపిదప నట్టిముక్కలను మనము తుండ్లని పిలుచుచున్నాముకాని వృక్షమని యెంతమాత్రమును జెప్పము. అతుండ్లను చీలికలుగాఁ జేసిన నట్టిచీలికలను బల్లలని చెప్పుచున్నాముకానివృక్షమనికాని తుండ్లనికాని చెప్ప

ము. పిమ్మట నాబల్లలను గాల్చినచో నట్టిదాని బొగ్గని చెప్ప చున్నాము. ఎవ్వనినైనఁ బిలిచియిదియేమియని యడిగినచో నది బొగ్గని చెప్పును. కాని వృక్షమని యెవ్వండును జెప్పఁడుకదా. చూచితిరా ? ఒకేపదార్థమున కెన్ని పేరులు గల్గుచున్నవో. ఇన్ని పేరులకవకాశమును గలుగఁజేసిన పదార్థము సత్తుతరగతిలోఁ జేరును. అట్టి యసత్తుతరగతిలోఁ జేరిన పదార్థములకు భావములేనఁగానునికి తెలియఁబడదనితత్త్వదర్శుల యభిప్రాయమైనట్లు శ్రీకృష్ణభగవానులు పల్కుచున్నారు. వృక్షము బొగ్గుగానగువఱకుఁ బొందుమార్పులకుఁ బరిణామమని పేరు. శంకరులవారి యభిప్రాయమెద్దియన నీశ్లోకానుగుణముగఁబరిణామస్వభావముగల పదార్థములకు భావము అనఁగా నునికి లేదు. ఇట్టియునికి లేకపోవుట యెట్లన్నను? ఏదో యొకరీతిని బరిణామముఁజెందిన పదార్థము చెట్టుగానో, తుండుగానో, బల్లగానో, బొగ్గుగానో కాన్పించుచున్నదికదా! దానికి భావము లేదనుటెట్లు దానికి భావము లేకపోవుట పారమార్థికమందు. వ్యావహారికమునందుఁబరిణామమును గలదిగాఁదోఁచు పదార్థమునకుఁ బారమార్థికమునందు భావము లేదని శంకరులవారి యభిప్రాయము. పారమార్థికమున నట్టి పదార్థములకు భావము లేకపోవుటకుఁ గారణమేమి ? భ్రమజన్యము

లుగావున భ్రమయనఁగా శుక్తినిజూచి రజతమని, రజ్జునుజూచి సర్పమని మరుమరీచికలను జూచి జలమని యోచించుట. దూరస్థముగా నుండు పురుషుఁడు మరుమరీచికలయందు జలభ్రాంతినిగొనుటచే నట్టిజలముయొక్క స్వచ్ఛమైన ప్రవాహమును, అందాకాశముయొక్కయు భూమియందైన చెట్టుచేమలయొక్కయు ప్రతిఫలనములను జూచును. అట్టి జలమునందుఁ దన దప్పి తీర్చుకొన నధికప్రయాసముతో నచ్చోటికిఁ జని యది జలప్రవాహముగాకుండుటను జూచి యద్దానిని భ్రాంతిగా గుర్తెఱుఁగునుగదా. ప్రప్రథమమున జలముగాఁదలఁచినప్పుడందు జలమందున్న గుణంబులనుబూనుటయేకాక జలసంపాదన ప్రవృత్తితోఁ దాపత్రయమును జెంది చిట్టచివరకు వృథాప్రయాసమును జెందినవాఁడగును చూచితిరా? భ్రమజన్యమైన కార్యంబులందు సత్యత్వబుద్ధియుఁ దదనుగుణంబైన ప్రవృత్తియు నెట్లు లోకసమాజంబులో.

మతకర్తలయొక్క యభిప్రాయంబులనవలి సారాంశము జేకొని గీతాశాస్త్రమీసందియంబుల నెట్లు నివృత్తిఁజేయునో కొంతవిచారింతము. మువ్వురు మతకర్తల యభిప్రాయంబు లిట్లుపరఁగుచున్నవికదా.

సత్ అసత్తు

మధ్వరాయలు—అభావము దెలియఁ-అభావము దెలియఁబ
బడనిది నిది

రామానుజులు—అభావము దెలియఁ—భావము దెలియఁబడ
బడనిది నిది

శంకరులు——అభావము దెలియఁ—భావము దెలియఁబడ
బడనిది నిది

ఇందు మధ్వరాయలు భేదించి శంకర రామానుజు లేకీ భవించుటంజేసి "అసత్తు" భావము దెలియఁబడని పదార్థమని నిర్ధారణచేయుట కెంతమాత్రమును సందియము లేదు. ఇం తియెకాక ప్రకరణసందర్భమగు సంశము నిట్టియభిప్రాయము తో నేకీభవించుచున్నది. అయిన సదసత్తులను గుర్తెఱుంగు ట కెద్దియేని సాధనమును గీతాశాస్త్రము ప్రసాదించెనా లేక వ్యాఖ్యానకారకుల యభిప్రాయములవలన నూహింపవల యునా? అర్జునుఁడీ వ్యాఖ్యానకారకులదరికిఁబోయి శరణంబు వేడవలయునని శ్రీకృష్ణుండు యోజించినట్టయిన దాను జెప్పక దాచివేయవలయును. అట్లు శ్రీకృష్ణులు తలంచుదురని యెంత వెట్టివాఁడైనను దలంపఁడుకదా! ఈ శ్లోకమువలన సదస ద్విభాగంబునకు నుపచరించు ననుమానంబులు.

సత్—అభావము దెలియఁబడనిది. ఏవస్తువునకు నభావము తెలియఁబడునో యదిసత్తుగాదు. కావుననసత్తు. అభావము దెలియఁబడినచో నట్టిపదార్థము నశ్వరంబుగావున నశ్వరపదార్థమసత్తు. కావున నాశనములేనిపదార్థముసత్తు.

అభావము తెలియఁబడనిది సత్తని చెప్పుటచే భావము తెలియఁబడునది సత్తని యోజింపఁగూడదు. భావముకలదని చెప్పుటచే నదిత్రికాలాబాధితమైన భావమునుగల్గి యుండవలయును. ఒకప్పుడుభావమునుకల్గి మఱియొకప్పుడు భావములేకుండినచోనది యసత్తగును. కావున నెప్పుడైనను భావము తెలియఁబడకపోయినచో నది యసత్తే. ఒకప్పుడుండి యొకప్పుడు లేనివస్తువు భావముకలదని యోజింపఁబడదు. దీనివలనఁ దేటయగుసంశయమెద్దియన. సత్ నిత్యముఅసత్తనిత్యముఅని-ఇఁక శ్రీకృష్ణులు చెప్పిన సాధనము సంజాతము.

" అవినాశితు తద్విద్ధియేన సర్వమిదంతతం।
వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్కర్తుమర్హతి॥ "

దేనిచేనీబ్రహ్మాండమంతయు నావరింపఁబడియుండెనో యద్దానిని వినాశములేనిదానినిగాఁ దెలిసికొనుము. నాశరహితమైన దీనికి నాశనమును జేయుటకొకడు నొకానొకఁడు సమర్థుఁడుగాఁడు "

ఈశ్లోకము చేనాశ రహితమైన పదార్థముయొక్క స్వభావము శ్రీకృష్ణులు ప్రతిపాదించుచున్నారు. ఏదిసర్వవ్యాపకమో యది నాశరహితము. అని చెప్పుటచేఁ గలుగునను మానములు- ఏదిసర్వవ్యాపకమో యదినాశరహితము

ఏది నాశరహితమో యది సర్వవ్యాపకము

ఏది సర్వవ్యాపకము గాదో యదినశ్వరము

ఏదిసర్వవ్యాపకమోదానికినభావము తెలియఁబడదు

ఏదిసర్వవ్యాపకమో యది సత్

సర్వవ్యాపకముగానిపదార్థము పరిచ్ఛిన్నపదార్థమనంబడు

ఏదిపరిచ్ఛిన్నమో యది నశ్వరము.

కావున నేదిపరిచ్ఛిన్నమో దానికి భావము తెలియఁబడదు.

కావునఁబరిచ్ఛిన్న పదార్థము లసత్తు.

దీనిచే మనము గుర్తెఱుఁగవలసిన విషయము. సర్వవ్యాపకము, నిత్యత్వమునకునిత్యత్వము సర్వవ్యాపకత్వమునకును హేతురూపముగనుండును. కావున సత్పదార్థము నిత్యమును సర్వవ్యాపకమును. అయ్యది యేవిధమైన వికల్పములకునవకాశము నీయఁగూడదు. సర్వవ్యాపకమైనపదార్థం బొక్కటికంటె నెక్కుడుండుట యుక్తియుక్తముగాదుకద. రెండుపదార్థములనిన చోనవి పరిచ్ఛిన్నములు గావలసివచ్చును. పరిచ్ఛిన్న

మైనచో నశ్వరమగును. కావున నిత్యమగునది సర్వవ్యాపక ముగావున నొక్కటియైయుండవలయు. తద్వ్యతిరిక్తముగాఁదోఁచునది భ్రాంతిగావలయుఁగానియథార్థమగుటకు వీలు లేదు. ఏలయన నిత్యమగుపదార్థమయ్యేనేని యది సర్వవ్యాపకము గావలయును. సర్వవ్యాపకమైనచో మఱియొకపరమాణువునకైన నవకాశమునీయఁగూడదు అని గీతాశాస్త్రమందు శాస్త్రయుక్త్యనుభవసిద్ధంబైన తత్త్వమాలవాలముగ స్వీకరింపఁబడియె.

శాస్త్రసిద్ధము- " సదేవసోమ్యేదమగ్రఆసీత్. ఏకమేవా ద్వితీయం,, ఛాందోగ్య

సజాతీయ విజాతీయస్వగతభేదరహితంబైన సత్పదార్థమున్న యది.

అనుభవము—లోకములోఁ బరిచ్ఛిన్నములగుపదార్థములు నశ్వరంబులగుట సార్వజనీనమైన యనుభవంబు

దీనిచేయుక్తి—పరిచ్ఛిన్నంబులగు పదార్థంబులన్నియు నశ్వరంబులుగావలయుననునది యుక్తి.

తత్త్వముయొక్క నిశ్చయము (ఉపయోగము)

అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాశ్శరీరిణః।
అనాశినో ప్రమేయస్య తస్మాద్యుద్ధ్యస్వభారత॥ II. 18

" నిత్యుఁడును నాశరహితుఁడును అప్రమేయుఁడునగు శరీరి (దేహి) యొక్క దేహములునశ్వరములని చెప్పఁబడినవి. కావున నోయియర్జునా యుద్ధముచేయుము "

ఈశ్లోకమునందిదివఱకు "అశోచ్యానన్వశోచస్త్వం" అను శ్లోకము మొదలు " యంహినవ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ" యనుశ్లోకమువఱకును ననుభవపూర్వకమైనయుక్త్యనుగుణంబుగ నిరూపింపఁబడినవిషయమును నిరూపించుచున్నారు. అదెట్టియన దేహి నిత్యుఁడు, నాశరహితుఁడు, అప్రమేయుఁడు. దేహములు నశ్వరములు. ఈసిద్ధాంతమును పైరెండుశ్లోకములచే వేద్యమగుసదసద్విభాగంబున సరిచేసిచూచినఁ దెలియఁబడుసిద్ధాంతమేమన. దేహియనఁగాశరీరినిత్యుఁడు. కావున సత్. సత్తయినచోఁ బరిచ్ఛిన్నుఁడుగాక సర్వవ్యాపకుఁడు కావలయునుగదా! కావున

శరీరిసర్వవ్యాపకుఁడు. సర్వవ్యాపకుఁడైనచో నొక్కఁడు గావలయునుగదా. కావునశరీరినిత్యుఁడు సర్వవ్యాపకుఁడు. ఒక్కఁడని తేటతెల్లమగుచున్నది. కావున దేహములు పెక్కులు గాఁదోఁచుచున్నను దేహియొక్కరుండని తేటయగుచున్నది.

గావుననే యీశ్లోకమునందు " ఇమేదేహాః " ఈదేహములు అనివరిదృశ్యమానమగు దేహములను జూపుచు "దే

భూః,, అనిబహువచన ప్రయోగముచేయఁబడి «శరీరిణః,, అని ఏకవచనప్రయోగముచేయఁబడినది. శరీరిని దెలియఁజెప్పు పద మేకవచనంబునందును, శరీరములను జెప్పుపదములను బహువచనంబునందునఁ బ్రయోగించుటచేఁ గలసారస్య మిద్దియు. నిత్యుఁడనిన చోనవినాశి యగును. అవినాశియనిన చో నిత్యుఁడగు నుగదా! ఈశ్లోకంబున «నిత్యుఁడు, అనాశనుఁడని రెండుపదము లెందుకుఁబ్రయోగింపఁ బడనలయును? పునరుక్తిదోషముకదాయనిన నిదిపునరుక్తదోషముగాదు. లోకములో రెండువిధములుగ నిత్యత్వము తెలియవచ్చుచున్నది. అవెవ్వియన: పరిణామనిత్యము కూటస్థనిత్యము. ఆతీరుననే నాశముకూడ రెండు విధములనిశంకరభగవత్పాదులీతీరున వ్రాసియున్నారు.

శంకరులు—నిత్యస్యానాశన ఇతినపౌనరుక్త్యం। నిత్యత్వస్య ద్వివిధత్వాల్లోకే నాశస్యచ యథాదేహో భస్మీభూతో దర్శనంగతో నష్టఇత్యుచ్యతే. విద్యమానోపి వయసాపరిణతో వ్యాధ్యాదియుక్తోజాతో నష్టఇత్యుచ్యతే॥ తత్రఅనాశనో నిత్యస్యేతి ద్వివిధే నాపి వినాశేనా సంబంధస్యేత్యర్థః॥

నాశము రెండువిధములు—దేహము భస్మమైనపిదప నగపడకపోవుటంజేసి నష్టమయ్యెనని చెప్పఁబడును.

దేహామగపడుచున్నను వయస్సుచేతను వ్యాధ్యాదులచేతను మార్పులతోఁ గూడుకొనినప్పుడును నష్టమయ్యెనని చెప్పఁబడును « నిత్యస్యానాశనః „ అనునప్పుడు ఈ రెండువిధములగు నాశనములలో నేదానితోడను సంబంధించియుండని నిత్యమని యొఱుంగునది. ఇట్టినిత్యమునకుఁ గూటస్థనిత్యమని పేరు. ఇట్టిదోషములతో సంబంధించిన నిత్యత్వమును బరిణామ నిత్యమందురు. ఇట్టి దోషగ్రస్తనిత్యమును నిత్యముగా నైయాయిక, సాంఖ్యాదు లంగీకరించియున్నారు. ద్వైతవిశిష్టాద్వైతులుగూడ వారితో నేకీభవించుచున్నారు. అద్వైతులన్ననో యట్టిదానిని భ్రమయనుచున్నారు. నిత్యమననో దోషగ్రస్తము కానికూటస్థనిత్యమునే యంగీకరించుచున్నారు. ఇంకను నైయాయికాదిమతంబుల నాశమన నవస్థాంతరప్రాప్తి. అద్వైతమందన్ననో పూర్ణముగు స్వరూపనాశముగా నెన్నఁబడుచున్నది. ఈవిషయమును శంకరులు తమ సూత్రభాష్యమునవిపులముగముచ్చటించిరి. ఇఁక నీశ్లోకముచేఁ దెలియఁదగిన విషయమింతకంటె నెక్కుడుగలదు. అదెద్దియన నివిని యొకు గీతాశాస్త్రమువలనఁ దెలిసికొనినవిషయ మెద్దియనశరీరినిత్యుఁడు సర్వవ్యాపకుండు సజాతీయ విజాతీయ స్వగతభేదములేనివాఁడనియుఁ గావున సత్ అనికదా « సదేవసోమ్యేదమగ్ర ఆ

సీత్ ,, "ఏకమేవాద్వితీయం,, ఇత్యాదిశ్రుతులవలన సర్వవ్యా
పకుండును సచ్చిదానందుఁడును సజాతీయవిజాతీయ స్వగతభేద
శూన్యుండును నగువాఁడు బ్రహ్మమని తెలియవచ్చుచున్నది."
ఇందుశరీరియందట్టిస్వరూపము వర్ణింపఁబడియున్నది. అయిన
బ్రహ్మముకంటెనీశరీరిభిన్నుఁడా? భిన్నుఁడైనచో బ్రహ్మమునకు
ను, శరీరికినిగూడపరిచ్ఛిన్నత్వముసిద్ధించుటచేననిత్యత్వముసిద్ధిం
చుచుండుఁగదా ఎట్టులనీదోషము నివారణయగునని పూర్వప
క్షముఁరాఁగా నట్టి పూర్వపక్షమును శ్రుతియే "తత్త్వమసి,,యను
నుమహావాక్యముచేనట్టిశరీరియేబ్రహ్మముఆబ్రహ్మమేయీశరీ
రి వీరలకభేదమని పూర్వపక్షమును నిరాకరించుచున్నయది.
కావున నీమూఁడుశ్లోకములునుతత్త్వమసియనుమహావాక్యము
యొక్క వివరణరూపముగాఁ బ్రకాశించుచున్నవి. ఈవిచారణ
చే నీగ్రంథమునఁబ్రత్యగ్బ్రహ్మైక్యము విషయమని స్ఫుటమ
గుచున్నయది.

## ఆత్మస్వరూపనిర్ణయము.

"అశోచ్యానన్వశోచస్త్వం ,, అనుశ్లోకము మొదలు
"యంహినవ్యథయన్త్యేతే పురుషంపురుషర్షభ ,, యనుశ్లో
కమువఱకు శరీరియొక్కస్వరూపమనుభవపూర్వకమైనయుక్త్య

నుగుణంబుగ నిరూపింపఁబడియున్నదని చెప్పఁబడియె. అర్థానిని గొంతవఱకు విమర్శింతము. ఏలయనఁగా మతమునకు నాత్మతత్త్వమాలవాలమై యున్నయది. "తరతి శోకమాత్మవిత్" "బ్రహ్మవిదాప్నోతి పరం" ఇత్యాది శ్రుతులవలన నాత్మవేత్త యనఁగా బ్రహ్మవేత్త యుత్కృష్టమును బొందుచున్నాఁడని చెప్పఁబడుటచే నాత్మజ్ఞానము సర్వానర్థభంజకంబును సకల శ్రేయోదాయకంబని తెల్లమగుచున్నది. ఆత్మజ్ఞానమనఁ "దన్నుఁ దాను దెలిసికొనుట" ఏమి వింత! తన్నుఁ దాను దెలిసికొనుటయొక గొప్పతత్త్వమఁట. తన్నుఁ దెలియనివాఁడొకఁడుండునా? తన్నుఁ దాను మఱచియొకఁ డెఱుఁగక యుండ లేదు కాని తన స్వరూప మెద్ది యో యెఱుఁగక యుండుట యొక వింత గాదు. ప్రతివానికిని దానున్నాను; తానువ్యవహరించుచున్నాను; తాననుభవించుచున్నానను జ్ఞానమున్నదికాని తన స్వరూపమెట్టిదియో యెఱుంగుట దుర్లభము. ఆత్మస్వరూపమునుగూర్చి యథార్థమైన తత్త్వమును దెలిసికొనలేక పెక్కులు విప్రతిపత్తులఁ బొందుటచేతనే పలువిధంబులగు ననర్థంబులకుఁ బాల్పడుట తటస్థమగుచున్నది. ఆత్మస్వరూపమునుగూర్చి పొందెడు విప్రతిపత్తులఁ గొంతవనుక లోకసిద్ధములైనవానిఁ జెప్పెదము.

శాస్త్రజన్యజ్ఞానశూన్యులగు పామరజనులును, లోకాయతికులనఁ జార్వాకులును దేహమాత్రమే యాత్మయనితలంచుచున్నారు.

ఇంద్రియములు చేతనములనియు, నవియేయాత్మయనికొందఱు, మనస్సనికొందఱు, క్షణికమగు విజ్ఞానమాత్రమని కొందఱు శూన్యమని మఱికొందఱును భావించుచున్నారు.

దేహాదివ్యతిరిక్తముగా సంసారికర్త, భోక్త యయిన వాఁడొకఁడుగలఁడని వైశేషికనైయాయికాదులు చెప్పుచున్నారు.

దేహాదివ్యతిరిక్తుండగు నాత్మ కేవలభోక్తగాని కర్తగాఁడని సాంఖ్యులు దలంచుచున్నారు. భోక్త కంటె వ్యతిరిక్తముగా సర్వజ్ఞుఁడును సర్వశక్తియునగునీశ్వరుఁడుగలఁడని యోగులుదలంచుచున్నారు.

భోక్త యగుజీవుని యొక్క యాత్మయే (అనఁగాస్వరూపమే పరమాత్మయని వేదాంతులు చెప్పుచున్నారు.

ఇట్లుపై వారిలోఁగొందఱుశుష్కతర్కయుక్తుల చేతను, గొందఱుకొన్ని శ్రుతి వాక్యముల చేతను, మఱికొందఱుశ్రుతియుక్త్యాభాసముచేతను విమోహితులై విపరీతజ్ఞానముగలవారై యున్నారు. విచారింపక కుమార్గంబులలోఁ జొచ్చినవాఁడు మోక్షభ్రష్టుఁడైయనర్థములకుఁ బాల్పడుచున్నాఁడు. కావున

ముముక్షువులందఱకును నిశ్శ్రేయసప్రాప్తికై బ్రహ్మజిజ్ఞాసాపూర్వకమగు వేదాంతవిచారము కర్తవ్యమనియాచార్యులు చెప్పుచున్నారు. వేదాంతవిచారంబునకుఁ బ్రప్రథమంబున సద్గురూపదిష్ట జ్ఞానంబావశ్యకంబు గావున నిట్టిదురభిప్రాయంబులఁ దవులువడకుండ నర్జునునకు శ్రీకృష్ణభగవానులచేఁ బ్రప్రథమంబున నాత్మస్వరూపంబయుపదేశింపఁబడియె. అద్దానినేకొంతవఱకు నిచ్చటముచ్చటింతము.

శ్రీకృష్ణభగవానులర్జునున కుపదేశించిన యాత్మతత్త్వము॥ 11వశ్లోకము మొదలు 30వ శ్లోకమువఱకునున్నదని పైని జెప్పఁబడెనుగదా! అద్దానినిగొంత విమర్శింతము.

శ్రీభగవానువాచ «అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే గతాసూ నగతాసూంశ్చనాను శోచంతిపండితాః॥ నత్వేవాహంజాతునాసంనత్వం నేమే జనాధిపాః। నచైవనభ విష్యామస్సర్వేవ యమతఃపరం॥ దేహినోస్మిన్ యథా దేహే కౌమారంయౌవనంజరా। తథా దేహాంతరప్రాప్తిర్ధీరస్తత్రనముహ్యతి »

ఆత్మతత్త్వము నుపదేశించుటయందీమూఁడుశ్లోకములచేతను స్థూలదేహాత్మవాదము నిరసనచేయఁబడుచున్నది.

« అశోచ్యానితి ,, ఈశ్లోకమునందర్జునునియొక్క యవివేకముసాగసుగఁబరిహాసముసేయఁబడుచున్నది. ఓయియర్జునా! నీవుపండితునివలె గొప్పవాక్యములనుబల్కుచున్నావుకాని నీయొక్క పాండిత్యమంతయు వాక్యమాత్రావశేషమైనట్లుల గాన్పించుచున్నది. ఏలయననీవుపండితులుపల్కువాక్యములను బల్కుచుండినను, అవివేకులట్ల యేరినిగూర్చివిచారింపఁబసిలేదో యట్టివారలనుగూర్చి వ్యర్థమగు విచారమును బొందుచున్నావు. అయినఁబండితులుమాత్రమట్టి విచారమును బొందరాయను శంక చేయుదువేని, పండితులు పోయినప్రాణములుగల వారినిగూర్చియు, పోనట్టి ప్రాణములుగలవారినిగూర్చియు దుఃఖింపరు. ఇట్టిన్యాయముచే నర్జునునియొక్క యవివేకవిశేషము సిద్ధాంతముచేయఁబడుచున్నది. ఇందలి యర్థాంతరన్యాస మర్జునునియందవివేకమును దెలుపుఁజేయుచున్నది.

అర్జునుఁడేరినిగూర్చి విచారముఁబొందె? వారలనుగూర్చి విచారమెందుకుపొందఁగూడదు? అర్జునుఁడు భీష్మాదులనుగూర్చి విచారమును బొందినట్లు « కథంభీష్మమహంసంఖ్యే ద్రోణం చమధుసూదన ,, యనువాక్యముచే స్పష్టమగుచున్నది. భీష్మాదులు వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులును బ్రహ్మచర్యాది వ్రతములచే శుద్ధసత్త్వమును జెందినయతులుగావున

బరమార్థః స్వరూపముచే నిత్యులుకావునవారలనుగూర్చియిం చుకంతయు విచారింపఁబనిలేదు. ఇంతియెకాకుండ భీష్మాదు లజ్ఞానుండు దలంచునట్లు దేహమాత్రస్వరూపులుగారు. దేహా ముకం బెవిలక్షణమైనయాత్మస్వరూపులగుటంజేసి వారలందఱును నిత్యులేకావున నట్టివారలనుగూర్చి శోకింపఁబనిలేదని చెప్పుట కు ,, నత్వేవాహం ,, అనుశ్లోకముచే నాయుద్ధరంగమునందున్న వారలందఱును త్రికాలాబాధితులని శ్రీకృష్ణభగవానులు చె ప్పుచున్నారు. ఈశ్లోకమునందు మతకర్తలు భిన్నాభిప్రాయం బులఁ బొందియున్నారు.

మధ్వరాయలు—ఈశ్వరనిత్యత్వ స్యాప్రస్తుతత్వాద్దృష్టాంతత్వే నాహ। నత్వేవేతి॥ యథాఅహంనిత్యః సర్వవే దాం తేషుప్రసిద్ధః ఏవంత్వమేతే జనాధిపాశ్చ నిత్యాః॥

రామానుజులు—యథాఅహం సర్వేశ్వరః పరమాత్మానిత్యఇతి నాత్రసంశయః తథైవభవంతః క్షేత్రజ్ఞాఆత్మా నోపినిత్యా ఏవేతిమంతవ్యాః। ఏవంభగవతస్స ర్వేశ్వరాదాత్మనాం పరస్పరంచ భేదఃపార మార్థికఇతి భగవతైవోక్తమితి ప్రతీయతే ** ** భగవదుక్తాత్మ భేదస్స్వ భావిక ఇతిశ్రు తిరప్యాహ॥

శంకరులు—త్రిప్వపికాలేషు నిత్యా ఆత్మస్వరూపేణేత్యర్థః।
దేహభేదానువృత్త్యా బహువచనం నాత్మభేదాభి
ప్రాయేణ॥

ఇందుమధ్వరామానుజులిరువురును శ్రీకృష్ణులవారిచే జీవనా
నాత్వము ప్రతిపాదింపఁబడెనని వక్కాణించిరి. అట్టి భేదనిరూ
పణంబునకీశ్లోకమందలిబహువచనప్రయోగమును,“అహం,త్వం
జనాధిపాః„ అనుశబ్దముల ప్రయోగమును బ్రధానమగుకా
రణంబుగ స్వీకరించిరి. శంకరులన్ననో యిందలిబహువచనప్ర
యోగము దేహభేదముననుసరించి ప్రయోగింపఁబడినదికాని
యాత్మభేదమునెంతమాత్రమునుబ్రతిపాదింపదనివక్కాణించిరి.

ప్రత్యక్షముగా లోకవ్యవహారమునఁగన్పట్టుచుండు జీవ
నానాత్వముంగూర్చియొకింతగంభీరముగాఁజెప్పుటయొకవింతగా
దు. పలయనఁబండితపామరులందఱును భేదము నేకనుచున్నారు.

ఆత్మ దేహముకంటె విలక్షణము, నిత్యము నని చెప్పుట
కై యనుభవవేద్యమగు దృష్టాంతమును శ్రీకృష్ణభగవానులు
చూపుచున్నారు. “దేహినఇతి„ “దేహీ„ యనఁగాఁబ్రతిదే
హమందును “నేను„ నేనని వ్యవహరించువాఁడు. ఇట్టి “నే
ను„ అనువానినే “అహంశబ్దవాచ్యుఁడని శాస్త్రములు వక్కా
ణుచున్నవి. ఈయహంశబ్దవాచ్యుఁడు. కరచరణాద్యవయవముల

తోఁగూడిన స్థూల దేహము లేక యీస్థూల దేహముకంటె విలక్షణుఁడాయనినచో నీదేహముకంటె విలక్షణుడని చెప్పుటకై లోకానుభవంబైన యుక్తి చెప్పఁబడియె. కరచరణాద్యవయవ విశిష్టమైన యీదేహము బాల్యయౌవనవార్ధక్యములనుమూఁడవస్థలను బొందుచున్నయది. ఒకపురుషునికిఁగల పూర్ణాయుర్దాయమని జెప్పంబడు నూరువత్సరములను మూఁడవస్థలుగా భాగించినచో బాల్యము 30వత్సరములు యౌవనము 30 సంవత్సరములు వార్ధక్యము 40వత్సరములను నాక్రమించుచు. ఈమూఁడవస్థలును దేహముపొందు విజాతీయమగు ధర్మముల ననుసరించియున్నవి. బాల్యమునందుండు దేహము యౌవనమందుఁగాని, యౌవనమందుండు దేహమువార్ధక్యమునందుఁగాని యుండునని చెప్పుటకు నెంతమాత్రమును జంతుదేహస్వభావమవకాశమునీయదు. ఏలయననీదేహము చర్మమాంసరుధిరమేదోమజ్జాస్నాయ్వస్థులను సప్తధాతువులచేనిర్మింపఁబడినదనియు నట్టిసప్తధాతువులును వత్సరసప్తకంబున నొకసారిపూర్ణంబగు మార్పును బొందుచుండుననియు జీవశాస్త్రము సిద్ధాంతముచేయుచున్నది. వాస్తవంబున నీదేహమొక నదీసామ్యమును బొందియున్నది. స్థూలదృష్టిచేఁ బ్రవాహము స్థిరరూపంబుగఁ గన్పట్టినను నీటియొక్క రాశపోశల న

ముదాయమై క్షణక్షణంబు మారుచుండు. అటులనే స్థూల దృష్టింజేసి దేహము కేవపదార్థముగాఁ దోఁచుచున్నను యథార్థంబున క్షణక్షణంబు మార్పుల నొందుటంజేసి క్రొత్తయగుచుండు. ఇట్టిమార్పులందుఁ బ్రాఁతపదార్థమొకించుక లేకుండ వత్సరసప్తకంబున క్రొత్తదై పూర్ణంబుగ మార్పు చెందునమనది జీవశాస్త్రసిద్ధాంతము. ఇట్టి పూర్ణమగు మార్పులు నాలుగైనచో మొదటిదియగు బాల్యావస్థ పోయి రెండవదియగు యౌవనావస్థ ప్రాప్తించు. అటులనేమఱినాలుగు పర్యాయములు దేహంబు పూర్ణంబుగ మాఱినచో వార్ధక్యము సంప్రాప్తంబగు. ఇట్లు బాల్యయౌవనంబుల నీస్థూలదేహ మెనిమిదిపర్యాయంబులు పూర్ణంబుగ నశించి వార్ధక్యంబు తొమ్మిది యవదేహంబుతోఁ బ్రారంభమగు. ఇట్లెనిమిదిపర్యాయంబులు దేహనాశంబుగలిగి వార్ధక్యము సంభవించినపుడు అహంశబ్దవాచ్యుఁ డించుకేనియు మార్పుజెందునేమోయని యోజించి చూచినఁబూర్ణంబగు నహంకారంబుతోఁ గూడియుండుటసర్వలోకానుభవంబైన విషయంబు. బాల్యావస్థముగిసినను అహంశబ్దవాచ్యుఁడు నాశముం జెందఁడు. అటులనేయౌవనంబు ముగిసినను అహంశబ్దవాచ్యుఁడు నాశముఁజెందఁడు. వార్ధక్యమందన్ననోదేహంబు మార్పులఁజెం

డుచున్నను అహంశబ్దవాచ్యుఁడు నాశముం జెందఁడు. అట్టివిషయంబున దేహముచేష్టలుడిగినంతనె యహంశబ్దవాచ్యునకు నాశనము సంప్రాప్తమగునని తలంచుట యవివేకవిషయంబుగాని వివేకవిషయంబుగాదు. అనేకపర్యాయంబులు దేహంబులు నశించుచున్నను గ్రొత్తదేహంబులెల్లు సంప్రాప్తమగుచున్నవి? అహంశబ్దవాచ్యుఁడు ప్రయత్నపూర్వకంబుగ సంపాదించుకొనుచున్నాఁడు. ఎట్లు సంపాదించుకొనుచున్నాఁడు? నియతమైనట్టి యాహార పానీయంబుల స్వీకరించుటచే. అతీగుణనే యంత్యదేహపాతానంతరమునఁబ్రయత్నపూర్వకంబుగ నొకదేహమును సంపాదించుకొను నన్నచో దోషమొందును గన్పట్టునని తోఁచదు. దానంజేసియే శ్రీకృష్ణభగవానులు "తథా దేహాంతరప్రాప్తిః" యని చెప్పిరి.

దేహము పలుతెఱంగుల మార్పులఁ జెందుచుండినను ఆత్మలేక దేహీ, అనఁగా నహంశబ్దవాచ్యుఁ డించుకేనియు మార్పుఁ జెందఁడను విషయమునుగూర్చి మధుసూదన సరస్వతు లీ యుక్తిని నుడివిరి. 1. బాలుఁడుగానుండినపుడుతనతండ్రిని దెలిసికొను"నహంశబ్దవాచ్యుఁడు" వార్ధక్యమునఁదనమనుమలను దెలిసికొనుచున్నాఁడు. దేహము పలువిధంబులగు మార్పులఁ జెందుచుండినను జ్ఞానము, అహంశబ్దవాచ్య జ్ఞాన మించుకేని

మార్పునొందలేదు. దేహికూడ దేహముయొక్క స్వభావము ను గల్గియుండినచో నిట్టిస్మృతి కొంతమాత్రి మవకాశముండ దు. 2 స్వప్నమందును, యోగబలానుగుణమగు నద్భుతపు మార్గములందు నీదేహి దేహ విభాగము పూర్ణముగా ననుభవ నీయమై యున్నయది. స్వప్నమునం దహంశబ్దవాచ్యుఁడు స్థిర త వహించియుండ ననేకవిధంబులగు దేహములనుధరించుటను సృజించుటను మనమనుభవించుచున్నారము.

కాయవ్యూహమను యోగశక్తిచే నొకపురుషుఁడొకే కాలమున ననేక దేహంబుల సృజించియందు నివసించియుండు ను. రాసక్రీడయందు శ్రీకృష్ణభగవానులిట్టి కాయవ్యూహము చే ననేకవేలశరీరప్రవిష్టులైరి యను నాశయమును గొందఱు దలపెట్టుచున్నారు. పరకాయప్రవేశ సామర్థ్య మీదేహి దేహభేదమును లెస్సగ ఋజువు చేయుచున్నది. ఇయ్యది శం కరభగవత్పాదానుభవ విషయమని గ్రంథములు వక్కాణిం చుచున్నవి. సౌభరిచారిత్రము కాయవ్యూహమును సూచిం చుచున్నది.

“ దేహాంతరప్రాప్తి,, యనుదానిచే స్ఫురించు దేహస ముదాయ ప్రాప్తి యనుల్లంఘనీయమా? అనఁగా నొకదేహ ము పోయినపిదప మఱియొకదేహము తప్పక వచ్చునా? య

నిశ్చో నిట్టిన్యాయము దేహాభిమాని విషయముగాని దేహాభిమానమును విడనాడిన జ్ఞానివిషయముగాదు. ఒకగృహాభిమాని తానుండుగృహము కూలినచో మఱియొండు క్రొత్తయింటిని స్వీకరించును. ధనాభిమాని తనకుండుధనము పోయినచో ధనమునుసంపాదించును. కళత్రాభిమాని కళత్రనష్టమునఁగళత్రమును స్వీకరించును. ఆతీరుననే తృణజలూకన్యాయముభంగి దేహాభిమాని దేహము వాసయోగ్యము కానిచో మఱియొకదేహమునుసంపాదించుకొనును. మఱియు నిట్టిదేహస్వభావ మాయాయి దేహాభిమానులయొక్క వృత్తుల ననుసరించియుండు. కావున నిట్టిక్షణికంబులగు స్థూలదేహములాత్మగావు కావున నశోచ్యములని యర్జుననకుపదేశించుటంజేసి స్థూలదేహము నాత్మగా భ్రమించు లోకాయతికచార్వాకాది మతములు శ్రీకృష్ణభగవానులచే నిరసనచేయఁబడుచున్నవి.

ఇఁక శ్రీకృష్ణభగవానులు సూక్ష్మశరీర మాత్మకాదని చెప్పుటకె

«మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాస్తాంతితిక్షస్వభారత
యంహిన వ్యథయంత్యేతేపురుషం పురుషర్షభ
సమదుఃఖసుఖంధీరంసోఽమృతత్వాయకల్పతే,,

మాత్రాస్పర్శాః-మాత్రాభిర్మీయంతే శబ్దాదయ ఇతి శ్రోత్రాదీనీంద్రియాణిమాత్రాః స్పృశ్యంత ఇతి స్పర్శాః శబ్దాదయో విషయాః మాత్రాణాం స్పర్శాః మాత్రాస్పర్శాః మాత్రాశ్చస్పరాశ్చ మాత్రాస్పర్శాః॥

ఇదివఱకు 11, 12, 13, శ్లోకములచే నీపరిదృశ్యమాన ముగుకరచరణాద్యవయవ విశిష్టమైన స్థూలదేహ మాత్మ కాదని స్పష్టీకరింపఁబడెను. కానియీస్థూలదేహ వ్యాపారముడిగినను స్వాప్నావస్థయందు సుఖదుఃఖవ్యాపారము, నేననుజ్ఞానము పూర్తిగానున్నయది. మఱియునీస్థూలదేహవ్యాపారము గల్గిన జాగ్రదవస్థకును స్థూలదేహ వ్యాపారముడిగిన స్వాప్నావస్థకును సుఖదుఃఖానుభవంబు సమానంబు. స్థూలదేహజ్ఞానము లేక పోయినను సుఖదుఃఖానుభవము గల్గుటచేతను స్థూలదేహము లేకుండినను నేననుజ్ఞానముండుటచేతను స్వాప్నావస్థయందు వ్యవహారమందుండి సుఖదుఃఖముల ననుభవించువాఁడుఅహంశబ్ద వాచ్యుఁడనియు నీస్థూలదేహ మాతనికి జాగ్రదవస్థయందాక సాధనమనియునర్జునుండు భ్రాంతిఁజెందునేమో యని శ్రీకృష్ణభగవాను లీరెండు శ్లోకంబులఁ జెప్పిరి. "మాత్రాఇతి," ఓ యర్జునా మాత్రాస్పర్శలోకప్పుడు సుఖమును మఱియొక

ప్పుడు దుఃఖమును, ఒకప్పుడు శీతమును మాత్రోయొ కప్పుడు ష్ణమును గలుగఁజేయును. దానంజేసి సంయోగవియోగములను గల్గియున్నవి. ఆహేతువుచేననిత్యములు. అనిచెప్పటచే నీసుఖదుఃఖాదిద్వంద్వములకుఁ గారణభూతమైన యింద్రియసముదాయరూపంబగు సూక్ష్మదేహము (లింగదేహము) నశ్వరమనియు ననిత్యమనియుఁ దెలియవచ్చుటచే నయ్యది యాత్మగాదని యెంఱుంగునది. మఱియు నీసుఖదుఃఖాదుల నీలింగదేహము పొందుచున్నదికాని ఆత్మయెంతమాత్రమును బొందలేదని స్పష్టమగుచున్నయది. ఇట్టియాశయమును « యంహీనవ్యధయన్త్యేతే పురుషంపురుషర్షభ » యనువాక్యము దృఢీకరించుచున్నది. సుఖదుఃఖాది ద్వంద్వములను సూక్ష్మదేహము పొందుచున్నదికాని యహంశబ్దవాచ్యుండెంతమాత్రమునుబొందఁడనుట శ్లోకంబే ప్రమాణమా లేకయనుభవమెచ్చటనైనఁగలదాయనసుషుప్తియందుఁ గూడనహంశబ్దవాచ్యుఁడుజాగ్రత్స్వప్నంబులందువలె సుఖదుఃఖంబులఁ బొందినచోనహంశబ్దవాచ్యుఁడెసుఖదుఃఖంబులఁబొందుచున్నాఁడని చెప్పనగుఁగాని లేకున్న నవకాశంబు చిక్కదు. సుషుప్తియందట్టి యనుభవమేరికిని గానరాదుకదా. జాగ్రదవస్థయందు దేహాభిమానముచే నేను సుఖమునను భవించుచున్నాను

దుఃఖమునను భవించుచున్నానని భ్రాంతిఁజెందునటులస్వప్నావస్థ యందుఁగూడ సూక్ష్మదేహాభిమానముచే సుఖదుఃఖాది భ్రాంతుల సహాంశబ్దవాచ్యుఁడు పొందుచున్నాఁడు. కాని శోకమోహములు, ఇంద్రియవ్యాపారము లాత్మను స్పృశింప నేరవు. కావునఁబట్టి నశ్వరములును క్షణికములునగు నింద్రియవ్యాపారములతో ద్వేషకొనుట శ్రేయోదాయకమని శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు. "యమిత్తి," శీతోష్ణాదిద్వంద సహానరూపమగు తితీక్షామాత్రమునను మోక్షార్హత గలుగదు. తితీక్షకుఁ దోడుగ జ్ఞాన వైరాగ్యములుండి తీరవలయునను నుద్దేశముంజేసియే "సమదుఃఖ సుఖంధీరం," అని చెప్పఁబడినది యని ఆనందగిరుల

సుఖదుఃఖాది వృత్తులకు లింగదేహము స్థానము. ఈ లింగదేహమే కార్యములను జేయునదియు, తత్తదనుగుణ ఫలంబుల ననుభవించునదియు నైయున్నది. ఇదినియమింపఁబడి స్వేచ్ఛనుబొందుచున్నది. ఆత్మ యీస్థూల సూక్ష్మశరీరముల కతీతము. ఎవ్వండీ స్థూలాది దేహతాదాత్మ్యమును విడచి, తన్ను సచ్చిదానంద స్వరూపునిగా గుర్తెఱుంగునో యట్టివాఁడు మోక్షముంబొందును. బుద్ధిఆత్మయొక్కయుపాధి. ఉపాధియన నొకదానిని దనయొక్క గుణములచేఁ గప్పివేయునది.

ఆత్మసాక్షిమాత్రుఁడు. దేహములను దన్నుగాఁదలంచుటఁజేసి బంధమును బొందుచున్నాఁడని మధుసూదన సరస్వతులీ శ్లోకమునకు వివరణమును జేసిరి.

సుఖదుఃఖములాత్మకు నెంతమాత్రము లేవనియునవ్వి భ్రమమూలములనియు మధ్వాచార్యులుసైతమంగీకరించుచు నీశ్లోకభాష్యమిట్లుల వ్రాసిరి. ॥ దేహశీతోష్ణాదిసంబంధాద్ధి శీతోష్ణాద్యనుభవ ఆత్మనః। తతశ్చసుఖదుఃఖే। నహ్యాత్మనః స్వతో దుఃఖాదిః సభవతి। కుతః। ఆగమాపాయిత్వాత్। యద్యాత్మనః స్వతః స్యుః సుప్తావపిస్యుః। అతోయతోమాత్రాస్పర్శా జాగ్రదాదావేవతేసంతి నాన్యదేతి తదన్వయవ్యతిరేకిత్వాత్తన్నిమిత్తా ఏవనాత్మనఃస్వతః। ఆత్మనశ్చతైర్విషయ విషయిభావసంబంధాదన్యః సంబంధోనాస్తి। నచాగమాపాయిత్వేపి ప్రవాహరూపేణ నిత్యత్వమస్తి। సుప్తిప్రళయాదావభావాదిత్యాహ। అనిత్యాఇతి। అతశ్చాత్మనోదేహాద్యాత్మభ్రమ ఏవసుఖదుఃఖకారణం॥

లింగదేహమాత్మగాదని నిరసింపఁబడుటచే నింద్రియాదులాత్మయని వాదించుమతములు నిరసనచేయఁబడుచున్నవి.

ఇంతదనుక శ్రీకృష్ణభగవానులచే నర్జునునకుపదేశింపఁబడిన తత్త్వక్రమంబెట్టిదనః—

11, 12, 13, శ్లోకములచే స్థూలదేహ మాత్మగాదనియు, 14, 15, శ్లోకములచే సూక్ష్మదేహమాత్మగాదనియును అట్టిదేహంబుల కతీతంబైన దేహి నిత్యమనియును, దేహంబు లనిత్యములనియు, ఏలయన నాత్మస్వరూపము నిదమిద్ధమ్మని నిరూపించుట యేరికిని శక్యముగాదు కావున నెల్లరుమహానుభావులును "నేతినేతీత్యాది" వాక్యములచే నాత్మతత్త్వము నుపదేశించుట సనాతనమగు నాచారమైయున్నది. అద్దెబ్బలన లోకములోఁగనప్పట్టు ననాత్మవస్తువులన్నింటిని వేర్వాని పిదపశేషించిన పదార్థము ననుభవంబుచే గుర్తెఱుంగుటకు శిష్యుని విడచిపెట్టుట. ఇయ్యాదిసర్వశాస్త్రానుగుణంబును ఆచారానుగుణంబునగు సాంప్రదాయము. శ్రీకృష్ణభగవానులిట్టి శిష్టాచారంబుదక్క వేఱొండు మార్గమును స్వీకరించునని యోజించుట యవివేకము. దానంజేసియె శ్రీకృష్ణభగవానులు స్థూలసూక్ష్మదేహంబు లనాత్మలనిచెప్పి యట్టిదేహద్వయాతీతుని తత్త్వమునుగూర్చి ముచ్చటింప "నాసతోవిద్యతేభావో నాభావోవిద్యతేసతః" యనుశ్లోకము నారంభించె. ఇట్లనుభవముచే వాత్మకు నిత్యత్వమునుజూపి పిదప తత్త్వవిదుల యభిప్రాయంబుచే నిత్యత్వానుగుణంబులగు ధర్మంబుల 16, 17 వ శ్లోకములచే ముచ్చటించి యాత్మ సర్వవ్యాపకంబనియు నాద్యం

తరహితమనియు సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమని
యుఁగూటస్థమనియు నుపదేశించె.

శ్రీకృష్ణభగవానులు, ఆత్మయొక్క తత్త్వము నిట్లుప
దేశించుచున్నారు.

నజాయతే మ్రియతే వాకదాచిన్నాయం భూత్వా౾భవితా
వానభూయః

„అజోనిత్యః శాశ్వతో౾యం పురాణో నహన్యతే హన్యమా
నేశరీరే (20)„

అచ్ఛేద్యో౾యమదాహ్యో౾య మక్లేద్యో౾శోష్యఏవచ
నిత్యఃసర్వగతః స్థాణురచలో౾యం సనాతనః॥ 24
అవ్యక్తో౾యమచింత్యో౾యమవికార్యో౾యముచ్యతే
తస్మాదేవం విదిత్వైనంనానుశోచితుమర్హసి॥ 25

ఆత్మతత్త్వమును నిరూపించు ప్రకరణము „ దేహీనిత్యమ
వధ్యో౾యం దేహేసర్వస్యభారత„ యనుశ్లోకముతో నుపసం
హారమగుచున్నది.

ఇంతవఱకు దేహికి, అనఁగా నహంశబ్దవాచ్యునకు నిత్య
త్వమును సర్వగతత్వమును స్థాణుత్వమును దేహముల కనిత్య
త్వమును నిరూపింపఁబడెను. ఇంకను దేహియొక్కయు దేహ
ములయొక్కయు తత్త్వమును వెల్లడిచేయుననుభవాంతరా

నుగుణంబగు యుక్తి నొకదానిఁ బ్రదర్శించెదము. ఇందుఁబ్రతిపురుషునియొక్క లోకవ్యాపారంబు ప్రధానంబుగ స్వీకరించునది. ప్రతిపురుషుఁడును బ్రతిదినమును జాగ్రత్స్వప్న సుషుప్తులను మూఁడవస్థలననుభవించుట సార్వజనీనమైనవిషయంబేకద. ఇట్టి మూఁడవస్థలపరామర్శచే నాత్మస్వరూపమును సాధింతము. అందుఁబ్రప్రథమంబునజాగరిత స్వప్నంబుల నొకింతవిచారింతము. జాగరితావస్థయన నింద్రియములచే విషయములను గ్రహించునవస్థ. "ఇంద్రియైరర్థోపలబ్ధిఃజాగరితమ్," పురుషుఁడు సామాన్యముగ నేను కండ్లతోఁ జూచుచున్నాను; చెవులతో వినుచున్నాను; నాలుకతో రుచిచూచుచున్నాను; దేహముతో స్పృశించుచున్నాను; ముక్కుతో వాసనచూచుచున్నానని పంచేంద్రియములతో వ్యవహరించునట్టియవస్థకు జాగరితావస్థయని పేరు. ఇంద్రియము లుపసంహారమును బొంద జాగరితావస్థయొక్క సంస్కారములవలనఁ బుట్టిన విషయానుభవ మెద్దియో యయ్యది స్వప్నమనఁబడును. వాస్తవముచే ననుభవకాలమునందు జాగ్రత్స్వప్నము లొక్కటేయనని ప్రకాశించుచుండు. కాని జాగ్రదవస్థయందలి విషయములవలె స్వప్నావస్థయందు గ్రహింపఁబడువిషయములు స్థిరములుగాక క్షణికములగుటం జేసి స్వప్నావస్థ జాగ్రదవస్థనుండి వేఱుచేయఁబడుచున్నది.

ఈ రెండవస్థలయందును బ్రతిపురుషుఁడుపొందు ననుభవము నొకింత విచారింతము. ప్రతిపురుషుఁడును నేను వ్యవహరించుచున్నాను; నేనుగలగంటిని; నేనునిదురపోతిని; అనిమూఁడవస్థలనుగూర్చి పల్కుచుండును. ఈ నేను అనువానినేఅహం శబ్దవాచ్యుఁడని శాస్త్రములు పల్కుచున్నవి. « ఈనేను » సర్వవస్తువులను గనిపెట్టు జ్ఞానమై యున్నాఁడు. ఈనేను పంచేంద్రియవ్యాపారములను గ్రహించు జ్ఞానమైయున్నట్లును, ఇంద్రియములకంటె వేరైనట్లును ఒక్కటియేయైనట్లును నేనుచూచుచున్నాను; నేనువినుచున్నాను; నేనుస్పృశించుచున్నాను; నేనురుచిచూచుచున్నాను; నేను వాసనచూచుచున్నానను ననుభవములవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ నేననుజ్ఞానముజాగ్రదవస్థయందు,అస్థిచర్మస్నాయుమజ్జామాంస శుక్లశోణిత శ్లేష్మాశ్రుదూషితమైనట్టియు విణ్మూత్రవాతపిత్త కఫసంఘాతముచే దుర్గంధమైనట్టియు నిస్సారమగు నీస్థూల దేహముతో తాదాత్మ్యముఁజెంది తదభిమానాయత్త చిత్తమై సర్వకార్యంబులందును వ్యవహరించుట సార్వజనీనమైన విషయంబె. స్వప్నావస్థయందన్నను నేనుచూచుచున్నాను; వినుచున్నాను; లోనుగాఁగల యనుభవంబులన్నియును జాగ్రదవస్థయందువలెనే యుండును. ఈస్వప్నావస్థయందుఁ గార్యాకార్యవివేకము, కర్మేంద్రియ జ్ఞానేంద్రియ వ్యాపారము, దేహార

తృణాదితాపత్రయము జాగ్రదవస్థయందువలెనే యుండును. స్వప్నస్థుఁడైనవాఁడు తాను స్వప్నము ననుభవించుచున్నానని యెన్నఁడుననుకొనఁడుగదా. జాగ్రదవస్థఁ జొచ్చినపిదపఁగదా నట్టియవస్థను స్వప్నమనియును గల్లయనియును దలంచునుగాని స్వప్నమందున్నచోఁ దలంపఁడుకదా?

సుఖదుఃఖసాక్షాత్కారముచే జాగ్రత్స్వప్నములు రెండును సమానంబులె. ఐనను జాగ్రదవస్థయం దినేనను జ్ఞానము సుఖదుఃఖానుభవంబునకై సాధనంబుగా గైకొనిన కరచరణాద్యవయవవిశిష్టమైన స్థూలదేహము నించుకేనియు సరకుగొనక పరివర్తించుచున్నట్లు సర్వలోకానుభవంబ. స్వప్నములో ఖడ్గహస్తుఁడై తనపైఁబడుశత్రువుతోఁబోరాడి ప్రాణరక్షణముఁ జేసికొనఁ దాపత్రయమును జెందు నేనను జ్ఞానము, బాహ్యమున శత్రువుచేఁగంఠమునఁదవులింపఁబడువలనుగుర్తెఱుంగఁడుగదా! ఇట్లుగుర్తెఱుంగకపోవుటకుఁ గల కారణమెద్ది? జాగ్రదవస్థయందు వ్యవహరించు నేనను జ్ఞానముకంటె స్వప్నమందు వ్యవహరించు నేనను జ్ఞానము వేరా? ఎంతమాత్రమును వేఱుగాదు. అట్లు వేఱైనచో జాగ్రదవస్థయందు స్వాప్నానుభవజన్యంబగు స్మృతియుసంభవము. అట్లు గుర్తెఱుంగకపోవుటకుఁ గారణంబు దేహాభావంబ. ఏమివింత దేహాభావము కారణమనినచో బా

హ్యమునందున్న మనము స్వప్నస్థుఁడైనవాని దేహమును జూచు
లేదా? దేహము ప్రత్యక్షముగ నగపడుచుండ దేహము లేద
ని చెప్పుచున్నారు. పరేమనము చూచినఁ జూడవచ్చు. అట్టిచూ-
పునకు మనభ్రాంతి కారణము కావచ్చును. స్వప్నస్థదృష్టిచే నీ
దేహమెంతమాత్రమును భావమును బొందియుండదు. అట్టిభా-
వమును బొందియుండినచో స్వప్నస్థుఁడు దప్పక నీదేహమును
గాపాడుకొనుటకుఁ బ్రయత్నించితీరును. కావున స్వప్నస్థునిదృ-
ష్టిచే స్థూలదేహము భావము లేనిదై యున్నది. ఒక్క స్థూలదే-
హమే కాదు, జాగ్రత్ప్రపంచమంతయు భావము లేనిదై యున్న
యది. ఆతీరుననే జాగ్రదవస్థయందున్నప్పుడు స్వప్నప్రపంచ
ము మిథ్యయగుచున్నయది. స్వప్నప్రపంచము మిథ్యయని చె-
ప్పుట కొకహితవాది యెంతమాత్రము నక్కర లేదు. ఏలయన
నది సార్వజనీనానుభవవిషయంబు. ఎల్లవారును జాగ్రదవస్థ-
యందుండినపుడు స్వప్నావస్థ మిథ్యయని చెప్పుట సహజమే కద
మఱియు స్వప్నావస్థయందున్నయపుడు జాగ్రత్ప్రపంచమునిం-
చుకేనియు గుర్తెఱుంగకుండుటయు నరకుఁగొనకుండుటయు
ననుభవనీయమే కద, ఆహేతువుచే జాగ్రత్ప్రపంచముఁ గూడమి-
థ్యయని యేల చెప్పఁగూడదు? ఇట్లు జాగ్రత్స్వప్నంబులు రెండు-
ను సజాతీయంబులగుటం జేసి యితరేతరమిథ్యాత్వసంపాదకంబు-

లగుచున్నవి. దానంజేసి జాగ్రత్స్వప్నంబులు రెండును మిథ్యయని గూఢించుచున్నది. కాని జాగ్రత్స్వప్నంబులననుభవించు నేననుజ్ఞానముమాత్రము స్థిరతగనుచున్నయది. ప్రతిమనుజుఁడుస్వప్నముననుభవించిన «నేను„ జాగ్రత్తిననుభవించుచున్నానను ననుభవమునుబ్రకటనచేయునుగానితద్విలక్షణమునుబ్రకటనచేయుట యెందునుగాన్పింపదు. దానంజేసిజాగ్రత్స్వప్నంబులకు నేననుజ్ఞానము సాక్షియని చెప్పఁబడు. నింకసుషుప్తియందన్ననో జాగ్రత్స్వప్నప్రపంచములు రెండును నించుకేనియు వేద్యములుగావుగదా ? సుషుప్తియందు నింద్రియవ్యాపారము,తాపత్రయము లించుకేనియుఁదోఁపవు. నేననుజ్ఞానమప్పుడానందమును బొందియుండును. సుషుప్తియందునేనానందముఁబొందుచున్నాననుసుఖానుభవజ్ఞానమెంతమాత్రమును దెలియఁబడదు. నేనున్నానుననుభవంబుగూడ నెంతమాత్రముండదుకదా ? అట్టిస్థితియందు నే ననుజ్ఞాన మానందమననుభవించుననని చెప్పుటకెట్లునోరాడును ? సుషుప్తియందలి సుఖానుభవమును జ్ఞానస్థితిని నిరూపించుటకు సుషుప్త్యనంతరకాలీనమైన స్మృతి సాధనమైయున్నయది. స్మృతియనఁగా ననుభవసంస్కారమువలనఁ బుట్టినజ్ఞానము. ఒకానొకఁడు నిన్నటిదినమున నొకపంఁడుదినును. నేఁడుతానాపంఁడును నిన్నతింటి

ననిజ్ఞప్తికిఁ దెచ్చుకొనును. ఇట్టిజ్ఞప్తిగడచిన దినమందలి ఫలభక్ష
ణానుభవసంస్కారంబువలనఁగల్గెనని శాస్త్రవిదులచేఁ జెప్పఁబ
డును. ఇట్టిజ్ఞప్తికే స్మృతియనిపేరు. ఎద్దియేని స్మృతిగల్గినచోఁ
దత్పూర్వంబగు ననుభవంబుండి తీరవలయును. అనుభవరహి
తమైన స్మృతియప్రసిద్ధము. నిదురవోయి లేచినవాఁడు " సుఖ
మహమస్వాప్సం " " నేను సుఖముగానిదురపోతిని " అను
స్మృతిని వెల్లడిచేయుచున్నాఁడు. సుషుప్తియందు నేననుజ్ఞాన
ము సుఖానుభవము లేకుండినచో "సుఖమహమస్వాప్స "మ్మ
నుస్మృతికి నెంతమాత్రమవకాశముండదు. కావున నిట్టిస్మృతి
చే సుషుప్తియందు " నేననుజ్ఞానము సుఖముననుభవించునటు
ల నూహింపవచ్చు. అయిన నట్టిసుఖానుభవకాలంబున నెద్ది
యైన జాగ్రత్స్వప్నప్రపంచజ్ఞానంబుఁ గల్గియుండెనాయనినచో
నట్టివెవ్వియును గానరావని " నకించిదవేదిషం ", నాకెద్దియు
ను దెలియఁబడలేదు, అనుస్మృతిచేఁ దెలియవచ్చుచున్నయది.
సుషుప్తియందున్న పురుషునికిజాగ్రత్స్వప్నప్రపంచంబులుమిథ్య.
జాగ్రత్స్వప్నంబులయందున్న " నేననుజ్ఞానముకంటె సుషుప్తి
యందలి నేననుజ్ఞానము ప్రత్యేకమనికాని, లేక సుషుప్తియం
దు నేననుజ్ఞానము లేదనికాని చెప్పఁగూడదా యనినచో నట్లు
చెప్పఁగూడదు. ఏలయన సుషుప్తినుండి లేచిజాగ్రదవస్థను బొం

దినవాఁడుస్వప్నమును గనినటువంటియు, నిదుర వ్రాయువట్టియు నేను జాగ్రత్తయుండున్నానను ననుభవమును వెల్లడిచేయుచున్నాఁడు. దానంజేసి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాత్రయంబు నందును నేననుజ్ఞానమించుకేనియు మార్పులేకయొకేతీరుననిలిచియున్నది. అవస్థలన్నవో వివిధములగు మార్పులఁగల్గియున్నవి. ఒకొక్కొకయవస్థ మఱియొకొక్కొక యవస్థను మిథ్యయని ప్రకటించుచున్నది. కాని నేననుజ్ఞానము మాత్రమించుకేని యుఁ జలనము లేక స్థిరముగనున్నయది. ఇంతవఱకుఁబ్రతిపురుషుఁడునొకదినమందుఁగడపుమూఁడవస్థలనుగూర్చి ముచ్చటించితిమి. రెండవదినమునందన్నవో మొదటిదినమందెట్లు మూఁడవస్థలనుభవించెనోయాతీరున నేయనుభవించుచున్నాఁడుకదా? మొదటిరోజునందలి నేననుజ్ఞానముకంటె రెండవరోజునందలి నేననుజ్ఞానము విలక్షణమని యెంతమాత్రమును వచింపనవకాశములేదుకదా? అతీరుననే యొకమాసమునకుఁ బిదప నేనను నొకక్రొత్తజ్ఞానముగపడదుకదా ? అతీరుననే యొక్కసంవత్సరాంతమున. అతీరుననే బాల్యమునను భవించిన నేనుయౌవనమునను భవించుచున్నాను వార్ధక్యమునను భవించుచున్నానను బాల్యయౌవన వార్ధక్యములందలి జ్ఞానముయొక్క ఏత్వముప్రకటన చేయఁబడుచున్నది. ప్రతిదినము మూఁడవస్థలచొప్పున

నొకవత్సరమునకు $3\times30\times12=1080$ అవస్థలను నేనుజ్ఞాన
ము పొందుచున్నను నేనుజ్ఞానము మాత్రి మేకాకారము
గానే యుండును. అవస్థయనఁగానేమి? దేహముపోయి దే
హాంతరప్రాప్తి. జాగ్రదవస్థను విడచిస్వప్నావస్థనుబొందు నే
నను జ్ఞానము జాగ్రదవస్థయందలి దేహమునెంతమాత్రము సరకు
గొనకుండుట లోకసిద్ధమనియు, అట్లు సరకుగొనకుండుటకు
దేహాభావముకారణమనియు నిదివఱకుఁజెప్పఁబడియెగఁదా?ఇం
కను స్వప్నవ్యవహారమునందు సూక్ష్మదేహము వర్తించుటయు
సుప్రసిద్ధముగద. ఒకఁడు స్వప్నస్థుఁడాయెనన్న చో స్థూలదేహ
మునువిడచి సూక్ష్మదేహమునుసాధనముగాఁగైకొనెనని వేరవ
చింపనేల? ఆతీరుననే సుషుప్తిఁజెందినవాఁడుసూక్ష్మదేహమును
విడచి కారణదేహమును సాధనముగా స్వీకరించుఁగదా! ఇంతి
యెకాదు సూక్ష్మదేహప్రవిష్టునకు, స్థూలదేహముమిథ్య
కారణదేహప్రవిష్టునకు సూక్ష్మదేహముమిథ్య. సుషుప్తిస్థుఁడు
మరల జాగరితావస్థయందుఁజొచ్చునపుడు మరల సూక్ష్మకార
ణంబులఁ గల్పించుకొనును దానంజేసి జాగ్రదవస్థపోయిస్వ
ప్నావస్థవచ్చునప్పటికి యొకస్థూలదేహము నష్టమగుననిస్ప
ష్టమగుచున్నదికదా? కావునవత్సరమునకుసాధారణంబుగ360
స్థూలదేహములు పోవుటతటస్థించుచుండు. అట్లుదేహములు

పోయి క్రొత్త దేహములు వచ్చుచుండినను దేహములకు సాక్షియగు నేనను జ్ఞానమేకాకారముగానే యున్నయది. ఇట్లుకడచినట్టియు, వచ్చునట్టియు, అనేకములైన దివసములు, వారములు, మాసములు, అబ్దములు, యుగములుకల్పములందు స్వయంప్రకాశమానమైన నేనను జ్ఞాన ముత్పత్తిలయంబులు లేకయేకాకారముగానే యుండును. ఇట్టిసర్వజనానుభవంబు జ్ఞానముయొక్క సత్యత్వము అనఁగా నిత్యత్వమును, దేహాదులయొక్కయు ప్రపంచముయొక్క మిథ్యాత్వమునుబుజువుచేయుచున్నది. ఈజ్ఞానమే యాత్మయని శాస్త్రముపల్కుచున్నయది.

ఈయాత్మయెల్లప్పుడును దనకుసుఖసంపాదకమగు తలంపుల నే కలిగియుండునుగాని తనకొకప్పుడైనను హాని రావలయునని కోరఁడు. తాను చిరజీవియై యుండవలయును నాశనమును బొందఁగూడదను తలంపెల్లవారలకును సహజంబు. ఇట్టి తలంపుచే నాత్మకుఁ దనయందుఁగల యుత్కృష్టతమంబగు ప్రేమ వెల్లడియగుచున్నది. ఇట్టి యుత్కృష్టతమంబగు ప్రేమకు నాస్పదుండగుటంజేసియె యాత్మపరానందుఁడని చెప్పఁబడుచున్నాఁడు. లోకములో దారపుత్రాదులనుధనముల నెక్కుడు ప్రేమతోఁ జూచుచున్నారలే యన నట్టి దారపుత్రాదులందలి ప్రేమ తనయందలి యుత్కృష్టతమంబగు ప్రేమచేఁ దక్క వే

కొండుగాదు. ఆ హేతువుచేతనే తనయందలి ప్రేమ యుత్కృష్టతమంబు. దానంజేసి యేపరమానందుఁడని చెప్పఁబడుటయును.

ఇట్టి లోకానుభవసిద్ధంబైన యుక్తిచే నాత్మసచ్చిదానంద స్వరూపుఁడని తెలియవచ్చుచున్నది. సత్పదార్థమైనచో సర్వవ్యాపియు సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమును, నిరవయవ నిర్గుణంబునుగా వలయునని యునిదివఱకు చెప్పఁబడియె. దానంజేసి యాత్మ అనఁగా దేహి సచ్చిదానంద స్వరూపుఁడు. సర్వవ్యాపియు సజాతీయవిజాతీయ స్వగతభేద శూన్యుఁడునని సదేవ సోమ్యేదమగ్ర ఆసీదిత్యాదివాక్యంబులచేఁ బ్రతిపాదింపఁబడు పరబ్రహ్మమేయనియుఁ దెలియవచ్చుచున్నయది.

శ్రీకృష్ణభగవానులు “అశోచ్యానన్వశోచస్త్వం„ అను శ్లోకము మొదలు “దేహీనిత్యమవధ్యోయం„ అను శ్లోకము వఱకు శాస్త్రయుక్త్యనుభూతి సిద్ధంబైన స్వస్వరూపజ్ఞానంబు నుపదేశించి యర్జునునకు నాత్మస్వరూప మందుఁగల దుర్భ్రమను నివారించినియతమగు స్వధర్మ మందుఁగల దుర్భ్రమను నివారింప రెండవప్రకరణమును “స్వధర్మమపిచావేక్ష్య„ యనుశ్లోకముచే నారంభముచేసిరి. అర్జునునకు స్వధర్మమందుఁగల దుర్భ్రమ యెద్దియనఁ యుద్ధము గురుబంధుజనను

హ్యాన్మిత్రాదివధాయాపంబగుహింసా బాహుళ్యం బగుటంజేసి నరకసంపాదకమగుననికదా.

స్వధర్మము.

« స్వధర్మమపిచావేక్ష్య నవికంపితుమర్హసి.

ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్యనవిద్యతే॥

ఓయియర్జునా, నీవీయుద్ధమును గూర్చి శోకమోహములఁ జెందకుండనుండుటకొక్క పారమార్థికతత్త్వమే కారణముగాదు. ఏలయన నీయుద్ధముక్షత్రియుండవగునీకు శ్రుతిస్మృతి విహితంబగు స్వధర్మము. అట్టి స్వధర్మమును విడనాడితేని ప్రత్యవాయము ఘటిల్లును. అట్టిప్రత్యవాయమొక్క పరమునకేకాక యిహమునకుఁగూడ భంగమునుసంపాదించునుగావునస్వధర్మమును విడనాడుటచే నిహపరములకు భంగమని శ్రీకృష్ణభగవానులు—

« అధచేత్త్వమిమం ధర్మ్యంసంగ్రామంనకరిష్యసి

తతః స్వధర్మం కీర్తించహిత్వాపాపమవాప్స్యసి॥

ఇత్యాదిశ్లోక పంచకంబుచే లోక మర్యాదానుగుణంబుగను శాస్త్రచోదితంబుగను వక్కాణించుచున్నారు.

ప్రస్తుతమర్జునునికి విధింపఁబడిన స్వధర్మము కర్మబాహుళ్యమును హింసాపూర్వకమును. కర్మాచరణంబువలన

జననమరణప్రవాహ రూపంబగు సంసారంబు ప్రాప్తించును. గాని మోక్షము సిద్ధింపదుకదా? దావంజేసి శ్రేయస్సునపే క్షించు సజ్జనునికి దుఃఖహేతువుదక్క వేరొండుగాదు. కావున శ్రీకృష్ణభగవానులు. పురుషుండెట్టి క్రమమున నియతధర్మము నాచరించిన కర్మబద్ధుఁడుగాకుండ లోకోపకారము గావింపఁగలఁడో యట్టిమార్గమును సంక్షేపంబుగ నుపదేశించుచున్నారు.

« సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వనైవం పాపమవాప్స్యసి ».
యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వాధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వాసమత్వం యోగ ఉచ్యతే॥

సుఖదుఃఖములు లాభాలాభములు, మానావమానమును లోనుగాఁగల ద్వంద్వములను సమముచేసియనసరకుగొనక నియతమగుకర్మమునుసంగరహితుఁడై ముముక్షువాచరింపవలయును. నియతకర్మమన వర్ణాశ్రమాధికారాను గుణంబుగ శ్రుతిస్మృతులచే విధింపఁబడినధర్మమనఁగర్మము ఇట్టినియతధర్మంబు నిష్కామకర్మమని పెద్దలు చెప్పుదురు. నిష్కామకర్మంబంతఃకరణంబును శుద్ధిచేసి పురుషుని జ్ఞానార్హునిగఁ జేయును. ఇట్టినిష్కామకర్మము సర్వానర్థభంజకంబును సకలశ్రేయోదాయ

కంబును. ఇట్టినిష్కామకర్మమును పురుషుండు స్థితప్రజ్ఞుడగువఱకు నాచరింపవలయును. స్థితప్రజ్ఞుడైనచో స్వస్వరూపజ్ఞానంబుగల్గు. దానంజేసి మోక్షంబుగల్గు. బుద్ధియందలి కాలుష్యముపోయి స్థితప్రజ్ఞత్వము నొందువఱకు నిష్కామకర్మమునుజేయవలయునని శ్రీకృష్ణభగవానులు చెప్ప నట్టిస్థితప్రజ్ఞుఁదెలిసికొను నభిలాషచే స్థితప్రజ్ఞ స్వభావమునుగూర్చి యర్జునుండు పృచ్ఛచేయ శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు.

స్థితప్రజ్ఞుఁడు.

ప్రజహాతియదా కామాన్సర్వా న్పార్థమనో గతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టఃస్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥
దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥
యస్సర్వత్రా నభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభం ।
నాభినందతి న ద్వేష్టి తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా ॥
యదాసంహరతే చాయంకూర్మోంగానీవసర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా ॥ 55-58

పైశ్లోకములందుఁ జెప్పఁబడినట్టిలక్షణములఁగల్గినపురుషుండు స్థితప్రజ్ఞుండనఁబడు. ఇట్టి స్థితప్రజ్ఞత్వము నొందిన పురుషుఁడుత్కృష్టతమంబగు శాంతిఁబొందు, అట్టిశాంతియందున్నట్టివాఁ

డై దేహపతనానంతరమున మోక్షముఁ జెందుననని

« విహాయకామాన్యః సర్వాన్పుమాంశ్చరతినిస్పృహః
నిర్మమోనిరహంకారః సశాంతి మధిగచ్ఛతి॥
ఏషాబ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్యవిముహ్యతి
స్థిత్వాస్యామంత కాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥
71_72

యను శ్లోకద్వయముచే శ్రీకృష్ణభగవానులు జ్ఞానని ష్ఠా ఫలస్వరూపంబుఁ జేసి తత్త్వోపదేశంబును విరమించిరి.

సంక్షేపము.

« ధర్మక్షేత్రే కురుక్షేత్రే » యను శ్లోకము మొదలు « ఏవముక్త్వాహృషీకేశం గుడాకేశఃపరంతపః » యను శ్లోకము వఱకునధికారి నిరూపణంబును, «అశోచ్యా నన్వశోచస్త్వం» అను శ్లోకము మొదలు «దేహీనిత్యమవధ్యోయం» అను శ్లోకమువఱకు స్వస్వరూపజ్ఞానమును పిమ్మట « శ్రుతివిప్రతిపన్నాతే » యను శ్లోకమువఱకు స్వధర్మరూపంబగు నిష్కామకర్మాచరణంబును తత్ఫలంబగు స్థితప్రజ్ఞత్వంబును పిదప « ఆపూర్యమాణమ్ » అనుశ్లోకమువఱకు స్థితప్రజ్ఞలక్షణంబును పిదప స్థితప్రజ్ఞత్వముచేఁగల్గు శాంతియుఁ దత్ఫలంబగు బ్రహ్మనిర్వాణంబును సంక్షేపంబుగను సుస్పష్టముగను వర్ణింపఁబడియుం

డుటంజేసియీరెండధ్యాయంబులును శాస్త్రంబునకు నియతంబ
గునను బంధచతుష్టయంబును గల్గియుండుటంజేసియింతటితో గీ
తాశాస్త్రము పూర్ణంబయ్యెనని చెప్పుట కెంతమాత్రమును
సందియంబులేదు. దానంజేసి కృష్ణప్రోక్తంబగు తత్త్వమును
గుర్తెఱుంగఁదలంచినచో నీరెండధ్యాయంబులనుండియే విమర్శిం
చునది. ఉపనిషదర్థమంతయు నీరెండధ్యాయములందు వెల్ల
డి చేయఁబడియున్నది. శ్రీకృష్ణప్రోక్త తత్త్వము రెండవయ
ధ్యాయంబుతో సమాప్తిఁజెందినచోఁ బిమ్మటఁ బ్రవర్తించినఁబ
దునాఱధ్యాయముల గ్రంథమున కవకాశ మెట్లు గల్గెను?
అట్టి యధ్యాయంబులందలి తత్త్వమెద్దియై యుండును? శ్రీ
కృష్ణోపదిష్టతత్త్వము నాలించినయర్జునునకట్టి తత్త్వశ్రవణంబు
న నెల్లరకును గల్గునట్టి సందియంబులు గలుగనట్టి సందేహనివృత్తి
కై శ్రీకృష్ణభగవానులు చెప్పిన సమాధానంబులీపదునాఱధ్యా
యములుగఁ బరిణమించినవి. వాస్తవముచే నీపదునాఱధ్యాయ
ములును రెండవయధ్యాయమునకు వ్యాఖ్యానమని చెప్పన
గును. రెండవయధ్యాయంబున సంక్షేపంబుగఁ జెప్పినయంశం
బులనే పదునాఱధ్యాయంబులందు సువిరళముగ ముచ్చటించిరి.
పరిశీలించిచూచినచో నీపదునాఱధ్యాయములును రెండవయధ్యా
యంబునందలి కొన్ని శ్లోకముల వివరణము. అయ్యదికొంచెము
నిరూపించెదము.

" యోగస్థఃకురుకర్మాణి," త్యాదిశ్లోకంబులచేఁ బ్రతిపాదింపఁబడిన సత్త్వశుద్ధి సాధనభూతమైన నిష్కామ కర్మనిష్ఠ సామాన్యవిశేషరూపములచే మూఁడునాలుగధ్యాయంబుల వర్ణింపఁబడియె.

శమదమాది సాధనపురస్సరంబగు శుద్ధాంతః కరణము గలవానికి " విహాయకామాన్యస్సర్వాన్ " అనుశ్లోకముచే విధింపఁబడు సర్వకర్మసన్యాసనిష్ఠ అయిదాఱధ్యాయంబులఁ బూర్ణంబుగ వర్ణింపఁబడియె "యుక్త ఆశీతమత్సరః " ఇత్యాది శ్లోకములచేఁ బ్రతిపాదింపఁబడు వేదాంతవాక్యవిచార సహితమైన భగవద్భక్తినిష్ఠ రెండవషట్కమునందు వివరింపఁబడియె.

" వేదావినాశినంనిత్యం " ఇత్యాదిశ్లోకంబులచే నిరూపింపఁబడిన తత్త్వజ్ఞాన నిష్ఠ పదమూఁడవయధ్యాయంబునఁబ్రతిపాదింపఁబడియె.

"త్రైగుణ్యవిషయావేదా" ఇత్యాదిశ్లోకములచేఁ బ్రతిపాదింపఁబడు తత్త్వజ్ఞాననిష్ఠాఫలంబగు త్రైగుణ్యనివృత్తి పదునాలవయధ్యాయంబునవిమర్శింపఁబడియె "తదాగంతాసి నిర్వేదం " అను శ్లోకముచే వర్ణింపఁబడిన తత్త్వజ్ఞాననిష్ఠాఫలంబగు జీవన్ముక్తి సంసారవిచ్ఛేద ద్వారంబున సంప్రాప్తమగునని పదునైదవయధ్యాయంబు వివరణంబుఁ జేయుచున్నయది.

"దుఃఖేష్వనుద్విగ్నమనా" ఇత్యాదిశ్లోకములచేఁ బ్రతిపాదింపఁబడిన దైవసంపద యుపాదేయమనియును, "యామిమాంపుష్పితాంవాచ" మిత్యాదిశ్లోకములచేఁ జెప్పఁబడిన యాసురసంపద హేయమనియునుబదునాఱవయధ్యాయము ఘోషించుచున్నయది.

"నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో" యను శ్లోకముచే నుపదేశింపఁబడిన సాత్త్వికీశ్రద్ధా తద్విరోధపరిహారము పదునేడవయధ్యాయమున వర్ణింపఁబడియె. పదునెనిమిదియవ యధ్యాయమన్ననో పూర్వోక్తవిషయము నంతయు నుపసంహారము చేయుచున్నయది. కావున నీపదునాఱధ్యాయములును రెండవయధ్యాయముయొక్క వ్యాఖ్యానమని నిర్వచించునది. దానం జేసి రెండవయధ్యాయంబు సంక్షేపంబుగఁ దత్త్వమునంతయు ముచ్చటించుచున్నదనునది నిస్సందేహము. ఈ పదునాఱధ్యాయముల గ్రంథము పెరుగుటకుఁ గలహేతువు అర్జునునకుఁ దత్త్వోపదేశానంతరమునఁ గల్గిన సందియంబు. అట్టిసందియంబు

"జ్యాయసీచేత్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన
తత్కింకర్మణి ఘోరే మాంనియోజయసి కేశవ॥

యను మూఁడవయధ్యాయ ప్రథమశ్లోకమునవర్ణింపఁబడియె. అర్జునునకుఁ గల్గినసందేహమటులుండ లోకములో

నీతత్త్వమునందుఁ గొన్నిభిన్నసిద్ధాంతములు చేయఁబడినవి వానిఁ గొంతవఱకుఁ దెలియుట యావశ్యకము.

మోక్షమునకుఁగర్మముసాధనమని మీమాంసకులు, జ్ఞానము సాధనమని వేదాంతులు, (అద్వైతులు) కర్మజ్ఞాన సముచ్చయంబని సముచ్చయవాదులు, భక్తి, జ్ఞానము, కర్మము ప్రత్యేక సాధనంబులని విశిష్టాద్వైతులును ఇట్లు పలువురు పలువిధంబులుగ సిద్ధాంతంబులఁ జేయుచుఁ దమతమసిద్ధాంతానుగుణంబుగనే గీతాశాస్త్రము ప్రతిపాదించుచున్నదనియును వాదించుచున్నారు. అందెద్ది గీతాశాస్త్రానుగుణంబగు సిద్ధాంతమో యొకింత విచారింతము.

ఈవిషయమును గూర్చి పలువిధములగు యుక్తులు సిద్ధాంతములున్నయవి. ప్రకృతమున సంక్షేపంబుగ ముచ్చటించెదము.

కర్మముగానికర్మజ్ఞానసముచ్చయంబుగాని మోక్షసాధనంబని వాదించువారల కిందుఁగలయాధారమర్జునునిస్వధర్మము విడనాడవలదని బోధించుటయు నాతనిచే యుద్ధముఁ జేయించుటయును.

అర్జునునకు శ్రీకృష్ణుండునిష్కామకర్మంబును విధించినంతనె మోక్షమునకుఁగర్మముసాధనమని చెప్పుటయసంగతము.

అధికారి తారతమ్యముచే సాధనతారతమ్యంబు. అర్జునుండు మధ్యమాధికారి. మధ్యమాధికారి తప్పక నిష్కామకర్మమాచరించితీరవలయును. లేకున్న చోనన్థములకుఁ బాల్పడును. ఉత్తమాధికారి జ్ఞాననిష్ఠకు నర్హుండు. అట్టి జ్ఞాననిష్ఠ మోక్షదాయకము. జ్ఞాననిష్ఠకు నర్హుండగువానికిఁ గర్మనిష్ఠ విధింపఁబడెయెనని శ్రీకృష్ణభగవానులే చెప్పుచున్నారు. "లోకేస్మిన్ ద్వివిధానిష్ఠాపురాప్రోక్తామయానఘ జ్ఞానయోగేనసాంఖ్యానాంకర్మయోగేనయోగినాం॥" కర్మముక్తం బజ్ఞానముత్కృష్టంబని శ్రీకృష్ణాభిప్రాయమైనట్టుల నర్జున ప్రశ్నమైన "జ్యాయసీ చేత్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన" యనుదానిచేఁ దేఁటయగుచున్నయది. శ్రీకృష్ణులయొక్క యభిప్రాయము కర్మజ్ఞానముచ్చయమేయైనచో నర్జునకృతప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబుగఁ గర్మజ్ఞాన సముచ్చయమని కాని కర్మము జ్ఞానమును ప్రత్యేకసాధనంబులని కాని చెప్పియే యుండవలయును. అట్లు చెప్పక "లోకేస్మిన్ ద్వివిధానిష్ఠాపురాప్రోక్తామయానఘ

జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేనయోగినాం॥"

అని బ్రహ్మనిష్ఠ రెండు విధంబులనియు నందు సాంఖ్యులు జ్ఞానయోగమును యోగులు కర్మయోగమును నాచరింపవలయునని చెప్పిరి. ఇచ్చట యోగులన జ్ఞానయోగమున కనర్హు

లును విషయవ్యాకులబుద్ధి యుక్తులనియు, సాంఖ్యులన నాత్మవిదులనియు నర్థము. కర్మయోగమునాచరించుచుఁ గ్రమక్రమంబుగ స్థితప్రజ్ఞత్వంబు నొందినవాఁడు జ్ఞానయోగమున కర్హుఁడగు. దానంజేసి మోక్షంబుఁ జెందు. ఇట్లు చెప్పుటచే జ్ఞానము మోక్షసాధనమనియు, నిష్కామకర్మము చిత్తశుద్ధికిఁ గారణమనియుఁ దెలియవచ్చుచున్నది. దానంజేసి కర్మము పరంపరయా సాధనము గావచ్చుఁగాని మోక్షమునకు సాక్షాత్సాధనంబు కాదు. అర్జునుండు మధ్యమాధికారియని చెప్పుటకుఁ బెక్కులువాక్యంబులు గాన్పించుచున్నయవి.

"కర్మణ్యేవాధికారస్తే," "యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి। తదాగంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥," "యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే మిథ్యైవ వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥ స్వభావజేన కౌంతేయ నిబద్ధః స్వేన కర్మణా। కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన। ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరాం॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం। తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం॥ ఇత్యాది వాక్యంబులచే నర్జునుండు స్థితప్రజ్ఞుండు కాఁడు కావున జ్ఞాననిష్ఠకునర్హుండును కాఁడు. కావునఁ గర్మనిష్ఠ యాతనికి విధింపఁబడెను.

సర్వాంక.ర్మాఖిలంపార్థ జ్ఞానేపరిసమాప్యతే॥
సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ॥
వేదావినాశినం నిత్యంయఏనమజమవ్యయం।
కథంసపురుషః పార్థ కంఘాతయతిహంతికం ॥

ఇత్యాదివాక్యంబులచేతను జ్ఞానాదేవతుకైవల్యం " పరీక్ష్యలో కాన్కర్మచితాన్ „ వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః॥ ఇత్యాదిశ్రుతులచే నిరూపింపఁబడిన సర్వకర్మసన్యాసపూర్వకజ్ఞాన నిష్ఠయె మోక్షప్రదమని గీతాశాస్త్రాభిప్రాయము.

" తమువాచహృషీకేశ ప్రహసన్నివభారత।
సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదంవచః॥

అనుశ్లోకవ్యాఖ్యానమునందు రామానుజులిట్లు వ్రాసియున్నారు. " పరిహాసవాక్యంవదన్నివాత్మపరమాత్మ యాథాత్మ్యతత్ప్రాప్త్యుపాయభూత కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగగోచరం " నత్వేవాహం జాతనాసమిత్యారభ్య„ అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచేత్యేతదంతం„ "వచఉవాచేత్యర్థః„ దీనిచేఁ బరమాత్మప్రాప్త్యుపాయములు అనఁగా మోక్షప్రాప్త్యుపాయములు కర్మయోగము జ్ఞానయోగము భక్తియోగమునని తెలియవచ్చుచున్నవి. గీతాశాస్త్రమునందుఁ బదునెనిమిదియధ్యాయంబులును బదునెనిమిదియోగంబులుగఁజెప్పఁబడుచుండ నందీమూఁడుయోగములయుత్కృష్టతయు, శేషించిన పదునైదింటియొక్కని కృష్టతయు రామానుజులు నిరూపణచేయవలసియున్నది. రామానుజులు తలంచి

నట్టులీ మూఁడుయోగములును మోక్షప్రాప్తికి నసమానమ గుసాధనములైనచోఁ బదునెనిమిదియధ్యాయములును బదునెనిమిది సాధనములు గావలయును. ఇయ్యది యసంగతమని శ్రీకృష్ణవాక్యంబగు „ లోకేస్మిన్ ద్వివిధానిష్ఠాపురాప్రోక్తా మయానఘ,,యనునది ప్రకటించుచున్నది. యోగమనిన సాధనముగాదె. అట్టి విషయంబునఁ బదునెనిమిది సాధనంబు లెందుకు కాఁగూడదు. ఈపదునెనిమిదియును సాక్షాత్సాధనంబులు గావు. ఇందు సాంఖ్యములేక జ్ఞానము సాక్షాత్సాధనము. తదితరంబులు పరంపరయాసాధనములును మందమధ్యమాధికారి విషయంబులును. కావునఁ గర్మనిష్ఠయందంతర్భూతములు. ఇంక నీయధ్యాయంబు లధికారతారతమ్యంబు ననుసరించి పెక్కుమార్గములఁబ్రదర్శించుచున్నవి. గీతాశాస్త్ర మెంతచూచినను జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠయను రెండు విభాగంబులచే బ్రహ్మనిష్ఠ ప్రకాశించుచున్నటులఁ గాన్పించుచున్నయది కాని వేఱొండురీతిఁ గాన్పింపదు. కర్మనిష్ఠ చిత్తశుద్ధికిఁ గారణము. చిత్తశుద్ధిగల్గినచో జ్ఞానముగల్గు. అట్టిజ్ఞానముచే మోక్షము గల్గునని „ జ్ఞానాదేవతుకైవల్యం ,, అను శ్రుతియొక్క తాత్పర్యమునే గీతాశాస్త్రము వెల్లడిచేయుచున్నది.

ఇంతవఱకును భగవద్గీతా శాస్త్రమునందలి మొదటి రెండధ్యాయంబులును సంక్షేపంబుగ విమర్శింపఁబడితత్త్వము నిర్ణయముసేయఁ బడెను. ఇట్టివిమర్శనంబుచే గ్రంథ మెట్టియుత్కృష్టతమంబగు తత్త్వమును బ్రతిపాదించుచున్నదో చదువరులు గ్రహించుదురు. దానంజేసి గ్రంథస్థజ్ఞానమును స్త్రవంబు

చేయనవసరమించుకనియుఁగాన్పింపదు. గ్రంథ మింతఘనంబు ను జ్ఞానంబును గల్గియుంచుటంజేసియేయనాదిగ నీశాస్త్ర మా ర్యావర్తంబున ననమానమగు గౌరవమును బడయుచున్నయ ది. ఈగ్రంథస్థజ్ఞానమును గోరిలినవార లఖండ సచ్చిదానంద మగ్నులై యుత్కృష్టతమంబగుబ్రహ్మనిర్వాణంబుఁ బడసిరి. భ గవద్గీతాగ్రంథమునుగురైఱుంగనివాఁడొకవిద్వాంసుఁడనియెం తమాత్రము సెప్పంబడఁడు. అ పా రా వా ర ం బు ను జ న్మమృత్యు, జరావ్యాధిరూపంబునగు సంసారసాగరంబునుండి జనులఁదప్పించి వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థులఁగఁ జేసి శా శ్వతమగు బ్రహ్మపదమును బొందింప సుకరంబగు సాధనమో యని బ్రహ్మవేత్తలు గొనియాడ శ్రీకృష్ణభగవాను లీ గీతాశాస్త్రము నర్జునముఖంబున లోకంబునకు వెల్లడిచేయ నద్దానిని గరుణచేఁ గృష్ణద్వైపాయనులు గ్రంథస్థముజేసి లోక మునుద్ధరించిరి ఇట్టి మహాధనంబును జనులెల్లరును వినియో గముచేసికొని బ్రహ్మానందముఁబొంది జ్ఞానమును బ్రసాదించిన మహామహులకు నానందముఁగలుగఁజేసి శాశ్వతమగుసుఖము ను బడయుదురుగాత!

అనన్యాశ్చింతయంతో మాం యేజనాఃపర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమంవహామ్యహం
భాతిలోకే యథాగంగాభాతిగీతాతథాభువి
తావద్గర్జంతిశాస్త్రాణిసేతిహాసాన్ ద్విజోత్తమ॥

ఓం

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీ కళ్యాణానందభారతీ
స్వామి ప్రణీతమ్.

## పూర్ణమీమాంసా దర్శనమ్.

౧ అథాతఃపూర్ణజిజ్ఞాసా

౨ యచ్చక్రాణామధిష్ఠానం

౩ భావవ్యంజకం రేఖారూపం

౪ తద్ధివృత్తరూపం

౫ రేఖాకోణ సామ్యావస్థా

౬ వృత్తాత్సర్వవ్యవహారవ్యంజకంసమత్రిభుజం

౭ అధ్యాసాత్

౮ పరత్రపరావభాసః

౯ త్రిభుజాత్పంచతన్మాత్రాణి తన్మాత్రేభ్యఃపంచమహా
త్రికోణాని తేభ్యోఽఖిలచక్రాణి

౧౦ ఉద్రేకాత్

౧౧ సమన్వయాత్

౧౨ తేనోపచయాపచయాచ్చక్రాణాం

౧౩ నతునిష్కోణస్యనిష్కోణస్య

ఇతిపూర్ణమీమాంసాయాం ప్రథమమాహ్నికమ్.

౧ బిందురితిచేన్నాయోగ్యత్వాత్
౨ అణుత్వాచ్చ
౩ అధికరణత్వాయోగాచ్చ
౪ త్రికోణమితిచేన్నాసంభవాత్
౫ శశవిషాణవదృజురేఖా
౬ ప్రమాణాత్
౭ శాస్త్రవయశ్శాస్త్రదయః

ఇతిపూర్ణమీమాంసాయాం ద్వితీయమాహ్నికమ్.

౧ నిరవయవంనిర్గుణం. నిష్క్రియంచిన్మాత్రంపూర్ణం.
౨ ఏకమేవాద్వితీయం
౩ పరిధిరావరణం
౪ త్రిభుజంవిక్షేపః
౫ పంచతన్మాత్రాణీంద్రియాణి
౬ మహత్త్రికోణానిభూతాని
౭ సర్వచక్రసమష్టిరూపోవిరాట్
౮ బ్రహ్మచక్రమితి కేచిత్
౯ బిందునవకవృత్తంశైవంచక్రం.
౧౦ వృత్తత్రికోణం హిరణ్యగర్భః
౧౧ వృత్తమీశ్వరఈశ్వరః

ఇతిపూర్ణమీమాంసాయాం తృతీయమాహ్నికమ్

౧ ఏతద్వైమహోపనిషత్

౨ తదర్థదర్శనాత్

౩ కింతత్వాక్షసంధిగ్ధం

౪ సామీప్యాత్

౫ పదబీజసంఖ్యారేఖానాముత్తరోత్తరంబలీయః

౬ ఇదంతుపారమార్థికం

౭ సర్వమన్యద్వ్యావహారికాత్

౮ పూర్ణవిత్పూర్ణమేవభవతి

౯ శ్రుతత్వాచ్చ

౧౦ స్మృతేశ్చ

౧౧ అనావృత్తిరనావృత్తిః

ఇతి పూర్ణమీమాంసాయాం చతుర్థమాహ్నికమ్

ఓం తత్సత్



